శ్రీ కొండనార్య ప్రణీత

# వివేక సింధువు

(వేదాంత తత్వ గ్రంథము)

వచన రచన :

పండిత పరిష్కారము



రోహిణి పబ్లికేషన్స్

మెయిన్ రోడ్ రాజమండ్రి-533101

శ్రీ కొండనార్య ప్రణీత

# వివేక సింధువు

(వేదాంత తత్త్వ గ్రంథము)

వ్యవహారిక వ్యాఖ్యానం :
పండిత పరిష్కారము





మూల్యం : రు. 25/-

ప్రథమ ముద్రణ : మార్చి 1995

ముఖ చిత్రం : బాలి

ప్రకాశకులు :
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్, రాజమండ్రి-1
ఫోన్ : 73444

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-2. ఫోన్:431422

# విన్నపం

శివశ్రీ ముకుంద మునీంద్రుల వారిచే విరచించబడిన యీ తత్వ వేదాంత గ్రంథాన్ని కొండనార్యుడు తెలుగు పద్యాలలో వ్రాశాడు. వాటికిది వచన రచన మాత్రమే.

కొన్ని నిబద్ధాలయిన శబ్దాలకి తెలుగు వ్రాయడం కష్టమైన కారణంగానూ, ఇంకొన్ని శబ్దాలుగా తెలుగు వ్రాస్తే విపరీతార్థాలు వచ్చే ప్రమాదం వుండడంవల్లా, మరి కొన్ని శబ్దాలను తెలిగిస్తే పూర్తి అర్థం పలకక పోవడం వల్లా-ఆ శబ్దాల నలాగే ఉపయోగించడం జరిగింది.

ఇక, కొండనార్యుడే కొన్నిచోట్ల—

"అతడు నీ వనుమాట లంతరించు"

"అతను నేను ననుట లణగిపోవు" వంటివి వ్రాశాడు.

మొదట చదవగానే - వాటి యాథ్యర్థాలని మాత్రమే గ్రహించినా - మరోసారి చదివినప్పుడు మనసు లక్ష్యార్థాల వైపుకి మళ్ళింది.

"అతడు నీవనుమాట" అంటే "తత్త్వమసి" అనే మహా వాక్యానికీ-

"అతను నేననుట" అంటే "సోఽహం" అనే ధ్యాన మంత్రానికి ఆంధ్రీకరణ లేమో ననిపించింది.

అంతటితో వచన ధారకి అడ్డుకట్ట పడింది. తిరిగి తిరిగి - పరిశీలించుకుంటూ - అటు వాఖ్యార్థానికీ, ఇటు లక్ష్యార్థానికీ భేదం కలగనంత వరకూ తెలిగించడం జరిగింది.

ఇక జహల్లక్షణం కాని, అజహల్ గాని, జహద జహల్ గాని అాదరానిచోట పొందిగ్గా కొండనార్యుడి మాటలే పొందుపర్చవలసి వచ్చింది.

విజ్ఞులూ, వివేకులూ అయిన పాఠకులు దీనిని చదివి- తమ అభిప్రాయాలనూ, ఆశీస్సులనూ, సలహాలనూ తెలిపినట్లయితే ఈ గ్రంథాన్ని ప్రతిష్టాత్మకంగా తీర్చుదిద్దుకో గలనని విన్నవించుకుంటూన్నాను.

సదా మీ

రచయిత

కొండనార్య ప్రణీత

# వివేకసింధువు

## వేదాంతతత్త్వ గ్రంథము

## పీఠిక

శ్రీ కైవల్య రమాకటాక్ష విలస
చ్ఛృంగార భావ ప్రసూ
నా కీర్ణాంఘ్రి సరోజుడై తదనుభూ
త్యానంద సంధ్యా స
త్సైకానంద లస చ్చిదాహ్వాయ వధూ
సేవారతిం జొక్కు వి
ద్యానల్పోన్నతు డైన సద్గురుని—ద
త్తాత్రేయునిం గొల్చెదన్॥

శ్రీ మోక్షలక్ష్మి యొక్క చూపులలోని శృంగార భావాలనే పువ్వుల మధ్యనున్న పాదపద్మాలు కలవాడై, ఆత్మానుభూతియొక్క 'సత్' ఆనంద ప్రకాశమానమయిన 'చిత్' సంబంధిత స్త్రీ మూర్తియొక్క సేవనమనే రతిలోలు

డయి వుండేవాడూ, చదువుల కల్పములో గొప్పవాడూ— నాకు గురువూ అయిన దత్తాత్రేయుడికి నమస్కరిస్తున్నాను.

అత్రిమహర్షి చేసిన తపస్సుకి ఆనందించి, అతనిముందు ప్రత్యక్షమైన శ్రీ మహావిష్ణువు—ముని "నేదయినా వరం కోరుకో" మన్నాడు. "నాకు కుమారుడివి క" మ్మని కోరాడు అత్రి—"ఇదిగో—యిప్పుడే నీకు దత్తుడి నవుతున్నా"నని చెప్పి, ఆ హరి అత్ర్యనసూయల యింట జన్మించాడు. నా గురు పాదుడయిన ఆ దత్తుడికి ప్రణమిల్లుతున్నాను.

శ్రేష్ఠులయిన యోగులు, రాత్రింబవళ్ళనే భేదరహితులై, నియమ నిష్ఠాపరులై, పూర్తి వైరాగ్యంతో కూడుకున్నవారై, కేవలానందమనే మధువుతో నిండివుండే తమ హృదయ పద్మాల నడిబొడ్డుమీద—ఏ గురుప్రద బ్రహ్మనయితే నెలకొల్పుకుని ఆయనయందే మగ్నమానసులై, ధ్యానాను సంధానాల ద్వారా మోక్షాన్ని పొందుతారో— ఆ గురుపరబ్రహ్మను ధ్యానిస్తూన్నాను.

గొప్పదైన విజ్ఞానానికి ప్రతీకగా భరతుడు తెల్లని గొడుగు పట్టగా, బిరుదునామాదికంగా లక్ష్మణ శత్రుఘ్నులు హెచ్చరికలు చేస్తూండగా, యోగ-జ్ఞానం అనే ఇద్దరు స్త్రీలు కుడిఎడమలలో వుండి చక్కటి వింజామరలు వీస్తుండగా, సేవారతురాకవతుగా—మోక్షలలామయైన సీతాదేవి ముచ్చటలు నాడుతూండగా,

రాక్షసుల చెడుగర్వాన్ని నాశనంచేసేవాడూ, కౌస్తుభ మణీ—ముత్యాలూ—రత్నాలూ వగయిరా హారాలను ధరించే

వాడూ, సీతాదేవి మనస్సులో నివసించేవాడూ, కళ్మలరహిత మయిన ఎంచక్కటి నీలిరంగు మబ్బు ఛాయను పోలినవాడూ, నాలుగు దిక్కులా వ్యాపించిన శరత్కాలపు వెన్నెలలవంటి దట్టమయిన సత్కీర్తి కలవాడూ సమస్త లోకాలందునా కూడా—జనన మరణాది లంపటాల సముద్రం నుంచి—గట్టెం క్కించగల—తారకనామం కలవాడూ అయిన శ్రీరాముడు నన్ను కాచుగాక!

పెసరకాయలవలె, ప్రకాశమానలయిన ఎఱుపుకు తిరిగిన ముంగురులు నుదుటిమీద శృంగారంగా ఊగు తూండగా; తెల్లతామర పూరేకులవంటి కనుల కొసలలో కరుణ కెఱటాలు లేస్తూండగా; నిత్యం ఆత్మానుసంధానమనే దానివలన యేర్పడిన సుఖం, ప్రకాశాదులతో కూడి— 'శాంభవీ' ముద్ర అలరారుతూండగా, సంపూర్ణమైన సత్త్వ గుణానికి ప్రతీకగా తెల్లని విభూది నలముకున్న శరీరం కాంతులు విరజిమ్ముతూండగా, భక్తులను కాపాడ్డంలోగల మార్గాలన్నిటినీ ఎరిగివున్న మనోభావాలు ప్రసరిస్తూండగా, వీరాసనాసీనుడై, నాకు కలలో కనపడే నా గురుదేవుణ్ని స్మరిస్తూన్నాను.

ఈ సంసారమనే ఘోరమైన సముద్రంలో మునిగిన నన్ను బయటకులాగి, గురుబోధకు అర్హుడిగానూ, తత్త్వజ్ఞుడిగా పరిణమింపచేసిన సర్వశుభంకరుడైన గురువును ప్రార్థిస్తూ న్నాను.

బ్రహ్మను కీర్తించి, విష్ణువుకు స్తోత్రంచేసి, శివుడిని పొగడి, సరస్వతికి గౌరవపూర్వకంగా నమస్కరించి, అదే

విధంగా లక్ష్మీదేవిని కూడా గౌరవించి, పార్వతిని స్మరించి, మదించిన ఏనుగు ముఖంవంటి-ముఖాన్ని గలిగిన విఘ్నేశ్వరుడిని సేవించి-వారందరి దయతోనూ ఈ క్రొత్తదయిన సత్ గ్రంథాన్ని వ్రాస్తాను.

వాల్మీకిని స్తుతించి, వ్యాసుడిని కీర్తించి, కాళిదాసూ-మయూరుడూ మొదలయిన గొప్పవారినందరినీ పొగిడి, బాణ-భవభూతి-శివభద్రులను తలుచుకుని, దండీ భారవుల్ని మనసులో నిల్పుకుని, మల్హణుడిని-బిల్హణుడిని-మాఘుడినీ స్మరించుకుని, ఇంకా ఇతరేతర సంస్కృత కవులందర్నీ తలచోసి, నన్నయభట్టునీ-శ్రీనాధుడినీ-తిక్కన సోమయాజినీ-పోతనగార్నీ-సోమనాధుడినీ-భాస్కరకవినీ-రంగనాథాది కవులను పదేపదే స్మరించి, నా తరువాత కాలంలో రాబోయే కవులందరికీ ప్రియం జరగాలని తలచోసి, తెలుగు కవిత్వపు చమత్కారంలో-వేదాంత సరళిని సభ్యులయినవారు మెచ్చుకునేటట్లుగా గ్రంథస్థం చేయదలచుకున్నాను.

అజ్ఞానంవల్ల యేర్పడిన అసత్య పండితులూ, తెలివి తక్కువవాళ్ళూ అయ్యి, మహాకవులు ప్రజాహితాన్ని ఆశించి నిర్మించిన పుస్తకాలలోని-మంచినంతటినీ, మిధ్యగానూ-వికటార్థాలతోనూ కొందరు బుద్ధి తక్కువవాళ్ళు ప్రచారం చేస్తూంటారు. ఆ ఒక్క గుణాన్ని వదిలేసి-మంచిని మంచిగా చూడగలిగితే అందరూ మంచికవులే వుంటారుగాని, చెడ్డ కవులుండరుకదా!

ఏవం విధంగా-ఇష్టదైవాన్ని ప్రార్థించి, గురువు నారాధించి, నాకు పూర్వులైన మంచి మంచి కవులనందరినీ పేరు పేరునా ఎంచి, చెడు కవులని తిరస్కరించి, చావుపుట్టుకల సంద్రాన్ని దాటింపచేసే వేదాంత ప్రకరణాన్ని-ముకుంద మునీంద్రుల వారిచే వ్రాయబడిన "వివేకసింధు"వనే గ్రంధాన్ని-తెలుగు భాషలో గద్య పద్య సమాహితంగా వ్రాయడానికి నిర్ణయించుకుని-ముందుగా-

సంసార బంధాలన్నింటినీ పుటుక్కున తెంచిపడేసే పునీతమైన-ఈ వేదాంతశాస్త్రాన్ని-వచన కావ్యంగా మలిచి, ఆధ్యాత్మిక సాధకులకు-ఆస్తికులకూ యెంతో ఉపకారం చేసిన పుణ్యాత్ముడు, కల్మషం లేని మనసు గలవాడూ, విజ్ఞానాన్ని శాసించగలంతటి పాండిత్య ధురీణుడూ అయిన ముకుంద మునీంద్రులవారికి నమస్కరిస్తున్నాను. ఇక-

మోక్షకాంతా మనోహరుడు, అధ్యాత్మయోగంలో సిద్ధ్యాసిద్ధికరుడు, కోటి సూర్యమండలాల పెట్టున ప్రకాశించే వాడూ, నీలమేఘపు రంగులో విరాజిల్లేవాడూ, పండితజనాల ఉదారమైన మనస్సులనే అందమైన తామరపూలలో చరించే తుమ్మెదకు; శమ, దమాది సదాచార పాలనలతో శంకా రహితులయేవారి హృదయాలలో సంచరించేవాడూ, కల్పించబడిన మంచి విషయ పరిజ్ఞానికి, కల్పవృక్షంలాగా కోరిన కోరిక లేదనకండా సమస్తాన్నీ దానం చేయడంలో శ్రేష్ఠు

డయినవాడూ, ఉండడం- లేకపోవడం-తక్కువ కావడమనేవి లేనివాడికి, ఎప్పుడూ యేవిధమైన వికారమూ ఎఱుగని వాడికి, భావాలకు లోలోపలి అర్థాలలో సూక్ష్మంగా వుంటూ-బ్రహ్మభమైన కాంతి ప్రమాణం కలవాడూ, భావానికీ, అభావానికీ అతీతుడై-నిత్యం శోభలతోనే కూడు కొనివుండే మహిమ కలిగినవాడూ, సర్వవృత్తులలోనూ గెలు పొందినవాడూ (ఇంద్రియ వృత్తులమీద నిగ్రహం కల వాడూ), 'సత్' వలన మాత్రమే శేషించి వున్న వాడూ, గొప్పదయిన చరిత్ర కలవాడూ, మహామునుల హృదయం గతుడూ అయిన దత్తాత్రేయుడికి అంకితంగా నేను వ్రాయ పూనిన యీ గ్రంథ రచనాక్రమం ఏమిటంటే—

# వివేకసింధువు

## మొదటి పాఠం

గొప్పదయిన జ్ఞానమనే మహత్తర శక్తివల్ల-సంకల్ప మాత్రంచేతనే సర్వాన్నీ పొందగలవాడూ, నిత్యం యోగ ధర్మాలను పాటించడమనేవే ఆభరణాలుగా ధరించి ఆనందించేవాడూ, పోలిక చెప్పడానికి వీలులేని రాజయోగానందమనే రాజ్యానికి అభిషిక్తుడై శత్రువుల్ని (అరిషడ్వర్గాన్ని-అవయోగాల్ని) గెలిచేవాడు, నిత్యమూ-యోగజ్ఞానాలనే స్త్రీలచేత సేవించబడుతూ మహిమలను ప్రదర్శించేవాడూ, మహాత్ర్యణ్ణాలైన వేదాంత వీధులలో మసలేవాడూ, శిష్యులకు ము ననుగ్రహించేవాడూ, ఏనాడూకూడా తుల్యమూనమైన దృ కలిగివుండేవాడూ, ప్రణవాదిమూలుడు అయినవాడే శా ణగురువు.

అజ్ఞానమనే చీకటిని చీల్చేసే సూర్యుడు, వేదాంతలోని స్వారస్యం క్షుణ్ణంగా తెలియడమనే తెలివి కలిగినవాడూ, కీర్తిమంతుడు, సమతుల్యత కలవాడూ, యోగసాధనాది సర్వవిషయాలూ ఆమూలాగ్రంగా తెలిసినవాడూ, పండితులచేత స్తోత్రం చేయబడే మహిమ కలవాడు, "తత్ = త్వం" అనే జ్ఞానాన్ని గలవాడు (ఆత్మజ్ఞాని), ఆశ్ర

యించిన వారిపట్ల వాత్సల్యాన్ని ప్రదర్శించేవాడూ అయిన 'గురువు'- ఇంతటివాడూ, అంతటివాడూ అని చెప్పగలమా? (చెప్పలేము.)

ఎలాంటి వికృతాలూ లేనివాడు, బ్రహ్మదేవుడి వంశానికి చెందినవాడూ, ఈ సంసారమనే సముద్రాన్ని తరింపచేసేవాడూ, నిత్య ఆత్మానుసంధాయి, శుభాలకు గనివంటివాడూ అయిన ఒకానొక కారణ గురుడి దగ్గరకు వెళ్ళి.

అకల్మషహృదయుడూ, ఆచారవంతుడు, కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యాలనే ఆరుగురు శత్రువులూ లేనివాడు, మంచివాడు, నాలుగు రకాల సాధనాలూ తెలిసినవాడు, ఏ మినహాయింపులూ లేకండా- కేవలం మోక్షాన్నే ఆశపడేవాడూ, మ చిగుణాలే అలంకారాలుగా కలవాడూ, సాధువులపట్లా-వృద్ధులపట్లా భయభక్తులు కలవాడూ, ఇంద్రియాలను జయించినవాడు, ఎప్పుడూ శరీరాన్ని పవిత్రంగా వుంచుకునేవాడూ, శుచి పాటించేవాడు, సత్యాన్నే పలికేవాడూ, వంశపరంపరాగతంగా బ్రహ్మచర్య వ్రతాన్ని ఆచరిస్తూన్నవాడూ, శమదమాది నియమనిష్ఠాపరుడు, బుద్ధిమంతుడు, నిత్యసంతోషి, పాపాలు చేయనివాడూ, సర్వాన్నీ సమానంగానే భావించేవాడూ అయిన ఒకానొక శిష్యుడొకనాడు-

గురువుగారి పాదపద్మాల్ని దర్శించి నమస్కరించి, దాసోహపరంగా రెండుచేతులూ జోడించి తన నుదుటిమీద వుంచుకుని-"కరుణే హృదయంగా కలవాడా! చెడువైన జన్మ

లనీ కర్మలనీ నాశనం చేసేవాడా! దుఃఖితులను ఓదార్చి పోషించేవాడా! నిత్యమూ స్థిరమైన జ్ఞానం కలవాడా! స్థిత ప్రజ్ఞుడా!

తీరమనేది లేనిదీ, మొసళ్ళూ తిమింగలాలూవంటి భయంకరమైన జంతువులతో నిండివున్నదీ అయిన యీ సంసార సాగరంలోపడి సుడి తిరిగిపోతూన్నాను. నీ అనుగ్రహం అనే పడవను నాకు ప్రసాదించి, నన్ను ఒడ్డుకుచేర్చు! దీనులకు శరణయినవాడా! గురుదేవా!

భార్యా, పుత్రులు, స్నేహితులు, కూతుళ్ళు, బంధువులు, సంపాదనలూ-చెట్టుబండలూ, గొడ్డూ గోదా, ఇల్లూ వాకిళ్ళూ మొదలయిన సమస్త వస్తువులూకూడా ఎందుకూ పనికిరానివిగా యదార్థంగానే విరక్తిపడి-మీ పాదపద్మాల నాశ్రయించాను. నన్ను ముక్తుణ్ణి చెయ్యి.

జ్ఞానబాహ్యుడినై. వివిధ రకాల కర్మాచరణమనే కాఅడవిలో పడి కాలుగాలిన పిల్లిలా తిరుగుతూ, కామాది ఇంద్రియ భోగాలనే పండ్లవలన యేర్పడ్డ చేదుకషాయాల్ని చెడత్రాగి, దుఃఖమనే దాహంతో వికారం చెందిననాణ్ణై, క్రుంగి-తుదిగా మీ పాదాలనే ఆశ్రయించాను. నీ దయ అనే అమృతాన్ని ప్రసాదించి, నన్ను కాపాడు-" అని ప్రార్థించాడు.

అతని మొఱలన్నీ విన్నాడు గురువు.

(2)

ఎక్కడెక్కడో పడి తిరిగి తిరిగి- ఈడుపు కాళ్ళూ, ఏడుపు ముఖముతో యింటికి చేరిన బిడ్డని-తల్లి ఎంత ఆదరంగా చూస్తుందో-అలా చూశాడా శిష్యుణ్ని. చేపలూ-తాబేళ్ళూ తమ పిల్లల కెలాటి స్తన్యంగాని-ఆహారంగాని యివ్వకండా, కేవలం తమ చూపులతోనే వృద్ధిచేస్తాయో-అటువంటి చూపు చూశాడా గురువు. పక్షులే విధంగానైతే బిడ్డ పక్షిని-రెక్కలలో పొదివుకుని పెంచుతాయో-అదే విధంగా గురువా శిష్యుణ్ణి దగ్గరకు తీసుకుని, తన పవిత్రమైన హస్తాలతో నిలువెల్లా నిమిరాడు. తర్వాత యిలా చెప్ప సాగాడు.

"అబ్బాయ్! ధర్మోక్తాలయిన అన్నిరకాల కర్మలనీ కూడా నువ్వెంత ఏకాగ్రతతో, క్రమం తప్పకండా నెరవేర్చినా అవన్నీ గొప్పగొప్ప సుఖాలని కలిగిస్తాయేమోగాని, మోక్షాన్నిమాత్రం ఇవ్వలేవు. అందువల్ల ఎవరయితే ముక్తిని పొందాలనుకుంటున్నారో, వాళ్ళు సద్గురువు నాశ్రయించి, ఆయనను సేవించి, నాలుగు రకాలా ఆరాధించి-మోక్షమర్గాన్ని తెలుసుకోవాలి.

నిత్యం గురుసేవలో నియమితం కావడం, మోక్షాన్ని మాత్రమే ఆశించేవాళ్ళు పాటించాల్సిన విధుల్ని పాలించడం, అందులో నైపుణ్యాన్ని సంపాదించడం, సర్వదా సాత్త్విక భావంతో వుండడం వల్లనే సమస్త శుభాలూ సమకూడతాయి.

ఇదిగో! వేదాంతసారాన్ని వినిపిస్తాను. చెవులారా విను. మనసులో ప్రతిష్ఠించుకో. తద్వారా అన్ని బంధాలూ

పుటుక్కున తెగిపోతాయి. ఇహంలో యోగం, పరంలో మోక్షం సిద్ధిస్తాయి. అందువల్ల ఇప్పుడు నే చెప్పబోయే దాన్ని అత్యంత శ్రద్ధతోనూ, అజ్ఞానమనే నిద్రను వదలి మేల్కొన్న తెలివితోనూ అర్థం చేసుకో.

ఈ వేదాంతం రెండు భాగాలు. అందులో మొదటిది "విరాట్ రూపం" దాని ప్రవర్తన-ప్రపంచమే తన ఆకారంగా వ్యాపించిన ఆ పరమేశ్వరుడిని, 'విశుద్ధ బ్రహ్మాం' అనబడే సత్యవంతమైన తెలివితో-ఈ సృష్టిస్వరూప నిర్మాణ విధిగా తెలుసుకోవాలి. చెప్పినంత తేలిక కాదనుకో. అత్యంత విశాలమూ, లోతయినదీ అయిన ఆ మూర్తిమంతాన్ని భావించగలగడం కష్టం. ఆ భావన ఎప్పటిదాకా కలగకుండా వుంటుందో-అప్పటిదాకా "అమూర్త (నిష్కళ) ఈశ్వరత్వం" అనేది అస్సలు బోధపడదు. ఇక రెండవ భాగం విను.

ఉత్తరార్థం, ఉత్తరభాగం, మలిభాగం, రెండవ భాగముగా చెప్పబడే-ఈ బోధనని శబ్దార్థ సంయుక్తంగా యెవరు హృదయంగతం చేసుకుంటారో-వారి యొక్క భయంకరమైన పుట్టుకా-వ్యాధులూ మొదలయిన ఉపద్రవాల్ని నివారిం చేస్తుంది. ఎంత గొప్పవైన బంధానాలనయినాసరే చటుక్కున త్రుంచివేస్తుంది. భరించశక్యం కాని సాంసారికమైన ఉద్రిక్తల నుంచీ తరింపచేస్తుంది. జాగ్రత్తగా విను.

మూఢం కే మూఢే మూఢు మాటలతో కూడుకున్న 'మహావాక్య వ్యాఖ్యానం'తో-జీవేశ్వరులకి ఏకత్వాన్ని చెబుతాను.

"తత్" అనేది ఒకమాట. "త్వం" అనేది రెండో మాట. "అసి" అనేది మూడో మాట.

"తత్" అంటే అది అని అర్థం. ఏది? ఇది కానిది- అంటే పరమాత్మ.

"త్వం" అంటే నువ్వు అని అర్థం. అంటే-జీవాత్మ.

"అసి" అంటే అయివున్నావు అని అర్థం. అంటే జీవాత్మ పరమాత్మల భేదంగా ఐక్యమై వున్నారని భావం.

వీటిలో 'తత్' 'త్వం' అనేవి తిరిగి రెండు రకాలు.

తత్పదార్థం శబలగానూ, శుద్ధ తత్పదం ఈశ్వరుడి పేరుగానూ చెప్పబడుతూన్నాయి.

అలాగే జీవుడికి 'సుశబల', 'శుద్ధత్వం' అనేవి పేర్లు.

ఈశ్వరుడు మహాశక్తికి యజమానియై యున్న వేళనే సృష్ట్యారంభమవుతుంది.

తత్పదార్థమైన మాయను ధరించినప్పుడు మాత్రం ఈశ్వరుడు శాశ్వితుడు, ఎప్పుడూకూడా యే వికారమూ లేకుండా వుండేవాడూ, పరిశుద్ధ పరబ్రహ్మమై విరాజిల్లుతాడు.

శబల-అధిభౌతిక, ఆధ్యాత్మిక, అధిదైవికాలనే మూడు తాపాలచేత దహించబడేవాడూ, సాకారుడు, స్థూల సూక్ష్మకారణ దేహాలనే మూడు శరీరాలనే వికారాలవలన రూఢుడు-అజ్ఞానం వలన ఏర్పడిన కర్మకాండలలో తెరిపి లేకండా మునిగివుండేవాడూ అని తెలుసుకో.

పైన చెప్పిన మూడు రకాల శరీరాలకీ అతీతుడై, అజ్ఞానంవల్ల వాంఛితాలయిన కర్మలనుంచి బంధవిముక్తు డయినవాడే శుద్ధత్వం పదార్థంగా చెప్పబడే ప్రత్యగాత్మ.

జీవుడు క్రమక్రమంగా శబలాన్ని వాచ్యార్థంగానూ శుద్ధాన్ని లక్షితార్థసారంగానూ గ్రహించి-ఈ శబలమనే కళ్మలాన్ని వదులుకున్నప్పుడు శుద్ధమైన లక్షితార్థం మాత్రమే శేషిస్తుంది.

నాయనా! సాధకుడయినవాడు-ఉపద్యుక్త క్రమంగా "తత్" పదాన్నీ, "త్వం" పదాన్నీ విశేషంగా యోచించి, శబలమనే కళ్మలానికి-లేదా-మాయకి నీళ్ళొదిలేసి, శుద్ధాన్ని మాత్రమే మిగుల్చుకుని-తనకు తానుగానే జీవుణ్ణి-పర మాత్మలో ఐక్యంచేసి సిద్ధిని పొందుతాడు.

ఓ కుండని తీసుకో, అందులో ఆకాశం (శూన్యం) వుందిగదా! అంటే-మూర్తిమంతంగా వున్న కుండకి లోపలి భాగమంతా కుండేడు శూన్యమేగదా! ఇప్పుడా కుండని బ్రద్దలుకొట్టేస్తే ఏమవుతుంది? దానితోబాటే, అందులో వున్న కుండేడు ఆకాశం కూడా నాశనమైపోతుంది. ఇక్కడ గమనించాల్సిందేమిటంటే 'కుండ' ఆకారం వున్నప్పుడు-కుండేడు ప్రమాణంలోనే వున్న ఆకాశం, కుండ పగిలి పోగానే-విశ్వవ్యాప్తంగా వున్న శూన్యంలో అయిక్యమై పోయి-మొత్తం ఆకాశమే తప్ప, మరేమీ లేకండా పోతుంది. అదే విధంగా మాయారహితమై స్వచ్ఛమైన తత్ పదార్థం లోనే మమేకం చెందడంవల్ల శుద్ధ బ్రహ్మత్వం ప్రాప్తిస్తుంది.

తత్ప్రాప్తి ద్వారానే-శరీరమనే కుండలోవున్న జీవుడు-సృష్టి బాహ్యాంతరాలన్నింటా భాసిస్తూన్న బ్రహ్మంలో లీనమై అఖండత్వాన్ని పొందుతాడు. ఆ అఖండ-అవిరామ-అవిచ్ఛిన్నత్వం ప్రాప్తించాక-మొత్తంగా వుండేది "దేవుడే" తప్ప జీవుడవడు. ఏ జీవుడు దేవుడియందు లీనుడో-వాడు మోక్షాన్ని సునాయాసంగా పొందగలుగుతున్నాడు. అయితే ఇదంతా ఎవరికి వారు ఎంతో కృషితో సాధించుకుని పొందాల్సిన విషయం.

చెప్పిందే చెబుతాననుకోకు—ఇది చాలా జటిలమైన విషయం కావడం వలన, ఒక్కొక్క సంగతిని-ఒక్కో స్థాయిలో-ఇంకో యింత సులువుగా చెబుతూంటాను. "శబల-తత్" అనే 'మాయ-దేవుడు' గురించి చెప్పానుగదా-ఇకిప్పుడు 'త్వం' గురించిగూడా విను. ఈ 'త్వం' అన్నదే జీవుడు. జీవుడు 'అజ్ఞానం' చేత కప్పబడటంవల్ల-చైతన్యరహితమైన మందబుద్ధియై-తనువే-తననుకుంటాడే తప్ప, తనని తను కానుకోలేడు.

ఇంకొక్క ముక్క శ్రద్ధగా విను. పైకి కనిపిస్తున్న కట్టెనే "స్థూల శరీరం" అంటారు. శరీరాన్నే 'ఘటం' 'బొందె' 'ఒళ్ళు' 'దేహం' 'తనువు' లాంటి, అనేక పేర్లతో చెబుతుంటారు. అటువంటి యీ 'స్థూల విగ్రహాన్ని' నువ్వు చూడగలుగుతున్నావు. దాని విషయ వాసనల్ని, అనుభవాల్ని-అనుభూతించగలుగుతున్నావు. ఒక్కసారి - కాస్త కుదురుగా ఆలోచిస్తే-ఈ పార్థివదేహం వేరు-దానిని పరికి

స్తున్నది వేరూనని అర్థం అవుతుంది. ఆ పరీకించేదే నువ్వు గాని-ఈ 'ఒళ్ళు' మాత్రం నువ్వు కాదు.

అంచేత, ఈ 'భారీ ఘటం' కన్నా-వేరైనవాడివే 'ను'వ్వవుతున్నావు. ఆ రీత్యా-'నువ్వు' అనబడే, 'త్వం' అన బడే, 'జీవుడు' అనబడే-'ఆత్మ' వేరైనదేగాని-'ఈ బొంది గాదు' అనేది స్వానుభవంలో తెల్సుకో.

ఇలా "నేతి నేతి" [న+ఇతి; న+ఇతి=ఇది కాదు, ఇదీ కాదు] అనుకుంటూ-నిన్ను నువ్వు తెల్సుకోగలగాలి.

గురువుగారి వాక్ప్రవాహాన్ని-తన సందేహంతో ఆపాడు శిష్యుడు- "గురూగారూ! 'ఘటం వేరు-దీన్ని చూసే కళ్ళు వేరూ' అన్నారుగదా! కళ్ళు-ఈ కట్టెలో ఓ భాగంగా వున్నప్పుడు-ఈ 'వేరుతనం' యెలా తెలుస్తుంది? పోనీ, కని పించే దేహం ఆత్మ కాదనుకుంటే-మరి కనపడని ఆ ఆత్మ ఇంకెలా తెలుస్తుంది-మరింత వివరంగా చెప్పండి" అన్నాడు.

శిష్యుడిలోని జిజ్ఞాసనూ-సందేహాన్నీ పసిగట్టిన గురు పాదుడు-పరమానందంగా యిలా చెప్పసాగాడు.

మంచి ప్రశ్నే వేశావు. కాని, యిలాంటి విషయా లన్నీ సాధనలో-స్వానుభవంగా తెల్సుకోవాలేగాని, వాటికి ఉదాహరణలూ గట్రా చెప్పడం కుదరదు. అయినా నీ శంకల పంకాన్ని వొదిలించేందుకు-కొన్ని దృష్టాంతాలు చెబుతాను. రెండు కట్టెల్ని రాపిడి చేయడంవల్ల అగ్ని పుడు తోంది గదా! ఈ అగ్ని ఎలా వచ్చింది? అంటే-ఆ నిప్పు నేది, ఆ కర్రల్లోనే వుండాలికదా! అలా వున్న ఆ నిప్పు

మనకెప్పుడు కనబడుతోంది? మనకున్న తెలివితో రాపిడిని సృష్టించినప్పుడు మాత్రమే అవ్వాలు అవ్వాలుగా మొదలై అగ్నిగా అగులుతోంది.

అదే విధంగా, 'కట్టె'లాంటి మన శరీరంలోనే 'ఆత్మ' అనబడేది అగ్నిమాదిరిగా అంతర్యాప్తమై వుంది. ఆ ఆత్మ కనబడదు సాధనా సంపత్తివల్లనే దాని సాక్షాత్కారాన్ని పొందాల్సి వుంటుంది.

అదలావుంచగా-ఈ శరీరాన్ని తీసుకుంటే-ఇది అప్రకాలయిన వికార భావాలతో కూడుకుని, కనబడి-కనబడకండా పోతుంది. కాని, ఆత్మ మాత్రం-ఏవిధమైన వికారం లేకుండా వుంటుంది.

శరీరం జ్ఞానశూన్యమైన జడం. "నిద్రొస్తోంది, ఇది పడకెక్కాల్సిన సమయం" అనిగాని-"చావు ముంచుకొచ్చింది, ఇది పాడెక్కి ప్రయాణం కట్టేయాల్సిన సమయం" అనిగాని-శరీరానికి తెలియవు. కాని, ఇవన్నీ తెలుస్తూనే వున్నాయిగదా! ఎవరికి! ఆత్మకే! అందుచేత ఈ స్థూల కాయం ఆత్మకాదు. ఆత్మ ఈ బొందెలో వుంది. దాన్ని పట్టుకోవాలి.

నిద్రా మరణాలనేకాదు-సమస్తమైన శరీరావస్థలనీ-కనిపెడుతూన్నది యేదో అదే ఆత్మ. అంటే-ఆత్మద్రష్ట. ద్రష్ట అంటే "చూస్తూవున్నది" అని అర్థం. ఈ దేహ వికారాలని చూస్తూవుంటుంది. పుట్టినపుడు పుట్టాననీ, పెరుసుతున్నప్పుడు పెరుగుతున్నట్లు, పోయేటప్పుడు అంతిమ

ప్రయాణాన్ని కూడా చూస్తూనే వుంటుంది. చూస్తూన్న దెప్పుడూ చూడబడేది కాదుగదా!-

నువ్వున్నావు. నువ్వొక చెట్టుని చూస్తున్నావు. చెట్టుని చూస్తున్నది నువ్వు. చూడబడుతున్నది చెట్టు. నువ్వు ద్రష్టవి. చెట్టు దృశ్యం. అదే విధంగా-ఈ దేహం దృశ్యమే తప్ప-ద్రష్టకాదు. ద్రష్టకాదు గనక-ఈ శరీరం 'ఆత్మ' కాదు. ఎవళ్ళో చార్వాక మతస్థులు కొందరీ స్థూలదేహమే ఆత్మ అని అంటారనుకో! కాని, ఏవిధంగా అదికాదో చెప్పానుగా!

అంతేకాదు - ఆచార్వాకుల సిద్ధాంతరీత్యా-శరీరమే ఆత్మ. నేలా, సంగీ, నిప్పూ, నీళ్ళూ, గాలీ-అనబడే ఈ అయిదే తత్త్వాలు. సూర్యచంద్రులూ-నక్షత్రాలూ-వాళ్ళే దేవుళ్ళు. ఇతరుల్ని దండించి-తమ ఆధిపత్యాన్ని పండించుకోడమే పరమ విద్య. ఈ భూమ్మీదిలా బ్రతికి గుటుక్కున చావడమే మోక్షం.

ఆత్మజ్ఞానం నేర్పుమనివస్తే-ఇలా చార్వాక మతం గురించి-చేంతాళ్ళా చెబుతున్నాడేవిటా అనుకోకు. యదార్థమైన ఆత్మవిద్యా జిజ్ఞాసువు-ఈ చార్వాకుల్లాంటివాళ్ళ గురించి చాలా జాగ్రత్తగా వుండాలి. అందుకే చెబుతూన్నాను-వాళ్ళున్నారు చూశావ్-ఆ చార్వాకులు-

వాళ్ళు, వేదాల్ని, శాస్త్రాల్నీ, ఆగమాల్నీ-అరిచ్చచ్చినా నమ్మరు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగాని,

ఇంద్రాది దేవతానీకంగాని లేరుగాక లేరంటారు. బ్రహ్మ దేవుడుండే సత్యలోకంగానీ, విష్ణుమూర్తుండే వైకుంఠంగాని, కంఠేకాలుడుండే కైలాసంగాని లేనేలేవంటారు. స్వర్గంగాని, నరకంగాని ఉన్నాయంటే ససేమిరా ఒప్పుకోరు. భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్య లోకాలనే మొగువ యేడూగాని-అతల, వితల, సుతల, తలా తల, రసాతల, మహాతల, పాతాళాలనే దిగువ యేడూగాని-అసలీ యేడేడు పధ్నాలుగు లోకాలూ కల్పనలే తప్ప విడిచి సత్యం కానే కాదంటారు. మేరుగిరి లేదంటారు. ఉప్పూ, పాలూ, పెరుగూ వగయిరాలుగా వుండే సప్తసముద్రాలుగాని-ఏడు దీవులుగాని లేవంటారు. ఈ జన్మలో అనుభవిస్తోన్న పూర్వజన్మ కర్మఫలాల్నిగాని-లేదా-ఈ జన్మలో మనం చేసే కర్మల పాపపుణ్యాలనిబట్టి యేర్పడే స్వర్గసుఖాలుగాని; నరక బాధలుగాని-వాటి గురించి చెప్పే గ్రంధాలుగాని-ఇవన్నీ కూడా పచ్చి అబద్ధాలని-ఈ లోలుకళ్ళకి తోచేదేముందో అది మాత్రమే నిత్యమూ సత్యమూననీ ప్రచారం చేస్తుంటారు.

అలాంటి అల్పమేధా ప్రలాపకులు, ఇంకా అటువంటి వేదశాస్త్ర విరుద్ధాలయినవాటినే ప్రతిపాదించే 'పాషండ' మతస్థులూ మొదలయినవారిపట్ల-వారి వచోప్రలోభాలపట్లా-ఆత్మ విద్యాసాధకుడెప్పుడూ అప్రమత్తంగా వుండాలిసుమా!

అసలు-వాళ్ళనేదేమిటి?-ఈ "స్థూలతనువే" ఆత్మ అని! మరదే నిజమయితే-యీ ప్రపంచంలో ఇంతమంది

ఇన్నిరకాల కర్మకాండలు చేస్తున్నారుగదా! వీళ్ళంతా స్వర్గం కోసమో-మోక్షంకోసమో తప్ప విడిచి-మళ్ళా పుట్టాలని గాని, మళ్ళా యీ ఒళ్ళో వాకిలీ కావాలనిగాని యెవరయినా కోరుతున్నారా చెప్పు!-లేదుగదా! మరి ఎవరిచేతా వాంఛించ బడని స్థూలదేహం-ఆత్మెలా అవుతుంది చెప్పు-కాదుగదా! అత్తెల్సుకో.

మరో మాటేమిటంటే!-ఈ శరీరం యీ భూమ్మీదే పతనమైపోయిన తర్వాత-గొయ్యితీసి, పాతెయ్యడమో, చితిని పేర్చి తగలెయ్యడమో చేసేస్తాంకదా! మరి ఈ ఒళ్ళే జీవుడయితే-చేసిన కర్మలఫలంగా స్వర్గనరకాల్ననుభవిస్తూన్న దెవరు? అంటే ఈ దేహంకానిదేదో వుందని అర్థం అవు తోందిగదా!-దాన్నిబట్టయినా ఈ దేహమే ఆత్మకాదు-అనేది రూఢిచేసుకో.

అసలీ స్పష్టంగాకనబడే స్థూల శరీరముంది చూశావా! దీని గురించి కాస్త తెలుసుకోవాలి. దీనికి చెందిన యీ-

ఎముకలు, తోలు, మాంసం, ఆంత్రం, వెంట్రుకలు-అనేవి భూమి అంశలతో తయారయి వుంటాయి.

మేద, మూత్రం, నెత్తురు, వీర్యం, చెమట-అనేవి నీటి అంశలవల్ల కలుగుతాయి.

ఆకలి, రోగం, ఆలస్యం, సంభోగం, నిద్ర-అనేవి-నిప్పు యొక్క అంశలవల్ల యేర్పడతాయి.

నిలకడ, త్రిప్పట, ఎగువ-దిగువ-ప్రక్కలకి సాగడం-అనేవి గాలి అంశలవల్ల జరుగుతాయి.

భయం, ఇష్టం, కోపం, కోరిక, లోభం-అనేవి-ఆకాశాంశలవల్ల అమరుతాయి.

ఈ విధంగా పంచభూతాలకు చెందిన ఇరవయ్యాయి దంశల్లో యీ స్థూలకాయం సృష్టించబడుతోందయ్యా! ఏం లాభం! చైతన్యంలేని మొద్దుపదార్థంకదా శరీరం! శుద్ధ చైతన్యానివైన "నువ్వు" ఈ మొద్దువి కావని తెలుసుకో. "ఇది"-"అది" కాదు. ఈ ఘటం నువ్వు కావు. దీని మెదలిక గాని, మెలకువగాని ఆత్మకాదయ్యా!

ఈ శరీరంలోవుంటూ - జ్ఞానేంద్రియాల ద్వారా-బయటి ప్రపంచంలోని కుదుర్లేని విషయాల్ని తెలుసుకుంటూ, దీని తాలూకు నిద్రా, మెలకువా మొదలయిన అవస్థలన్నింటి కన్నా అతిగా వుండేవాడే విశ్వుడనీ-కాబట్టి ఇవేవీ కూడా "అది" కావనీ వేదాలు చెబుతున్నాయోయ్!

ఇందాకా చెప్పానుగా-నేతి-నేతి [న+ఇతి=నేతి=ఇది కాదు] అని-ఆ ధోరణిలోనే ఆత్మజ్ఞానాన్నలవరచుకోవాలని వేదాలన్నీ ఢంకాబజాయించి మరీ చెబుతూన్నాయి.

మెలకువగాని, తద్వారా చూడగలుగుతూన్న-చూస్తూన్న కళ్ళుగాని, ఇవన్నీ ఆత్మకు దృశ్యాలే తప్ప మరోటికాదు,

ఈ సర్వభూత వికారాలవల్లా యేర్పడ్డ దేహం-ఆత్మ కాదని అన్ని వేదాలూ ఘోషిస్తున్నాయి.

అయినప్పటికీ కొంతమంది-దేహాత్మలు రెండూ అవినాభావ సంబంధాలనీ, ఆత్మే దేహంగా పరిణమించిందనీ, దేహమే ఆత్మగా భాసిస్తుందనీ-యేవేవో కాకమ్మ కథలు చెబుతారుగాని-బుద్ధిమంతులయినవారు వాటిని పట్టించుకోకూడదు.

ఇంకొంతమంది-మూలాధార చక్రాన్నీ, నాలుగు దళాల్నీ, నావాసాంతాన్నీ (వ,స-అక్షరాలతో అంతమయ్యేవానిని)-భూముద్రనీ, తెలివికిరవైన విఘ్నేశ్వరుణ్ణీ, ప్రకాశవంతమైన ఆకుపచ్చటి రంగునీ, యిలా వివిధ ప్రక్రియలతో సాధించాల్సిన చక్రాన్ని-అజ్ఞానంతో భావించి-అవే ఆత్మలుగా తలపోస్తుంటారు.

మరోమెట్టు పైకెక్కి--మరికొంతమంది-లింగస్థానాన్నీ, ఆరు దళాలతో శోభించేదీ-బ్రహ్మని యజమానిగా కలిగిందీ-బాలాంత్యాక్షరీ (బ-ల-అనే అక్షరాల అంతంలో విరాజిల్లేదీ) సంకీర్ణమైంది, సమస్త శుభఫలాలకీ ఆలవాలమైందీ అయిన-స్వాధిష్ఠాన చక్రంలోనే-సంగరాహిత్యంతో (అంటే-మరో ధ్యాస లేకండా) ఆత్మ సాక్షాత్కారాన్ని పొందుతూన్నామంటున్నారు.

ఇంకొంచెం ఎదిగినవాళ్లు-మూలాధారానికీ, స్వాధిష్ఠానానికీ పైనవున్న మణిపూరచక్రాన్ని ఆశ్రయిస్తూన్నారు.

ఈ మణిపూరానికి పదిదళాలుంటాయి. ఈ "దళం" అనే మాట నీకర్థం కావడం లేదనుకుంటాను. విడమర్చి చెబుతాను విను. ఆ స్థానాన్ని ఒక పువ్వులా భావించితే-ఆ పువ్వుకి పది రేకులుంటాయని భావం. లేదా, ఆ పువ్వు-పది ఆకులతో చుట్టబడివుందీ అనికూడా అర్థం చేసుకోవచ్చును. ఇందాకటి కన్న ఇప్పుడు కొంచెం అర్థమైందిగదా! మరింత వివరంగా మరో సమయంలో చెబుతాను. ప్రస్తుతానికివస్తే-బొడ్డు భాగంలో వుండి, పదిరేకులుండి, డఫాంత (ఢ-ఫ-అక్షరాలతో అంతమయ్యే) మై, కోరిన కాంతితో ప్రకాశిస్తూ, విష్ణువు అధిపతిగా గలదీ-భూతముద్ర గలదీ, నిష్కల్మష మైనదీయైన మణిపూర చక్రదర్శనలోనే ఆత్మదర్శనం పొందామంటారు.

మరికాస్త మేధావులయిన వాళ్ళు - హృదయ ప్రాంతంలో వుండేదీ, పచ్చని కాంతులీనేదీ, వాయుభూతం అధిపతిగా వుండేదీ, సన్ముద్రతో ఆరాధించదగిందీ, క-ఠ-శబ్దాలతో అంతమయ్యే పన్నెండు దళాలు గలిగిందీ అయిన 'అనాహత చక్రం'లో ఆత్మదర్శనమయ్యిందంటారు.

వాళ్ళకన్నా అధికులు-గొంతు ప్రాంతంలో వుండేదీ, మాణిక్యం రంగులో వెలిగేదీ. పదహారు దళాలుండేదీ అయిన విశుద్ధంలో ఆత్మదర్శనా సాధన చేస్తారు.

ఇక, అంతకన్నా పైవాళ్ళు - రెండే రెండు దళాలతో వుండేదీ, "హం, క్షం" అనే అక్షరాలతో దీపించేదీ, మన నాసల మధ్య నుండేదీ అయిన ఆజ్ఞా చక్రారాధన ద్వారా ఆత్మసాక్షాత్కారాన్ని అనుభవిస్తుంటారు.

పరాకాష్ఠకు చేరిన యోగి పుంగవులు మాత్రం - ఈ మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞలనే ఆరు చక్రాలకీపైన - సర్వాతీతంగా ప్రకాశించే సహస్రార (వేయి దళాలు కలిగిన) చక్రంలో ఆత్మానుభవాన్ని పొందుతూంటారు.

అర్థంకావడం కొంచెం యిబ్బందిగానే వుండొచ్చును- మరింత లోతుకు పోగాపోగా అన్నీ స్పష్టంగా తెలిసిపోతాయిలే. మొత్తమ్మీద - యిలా యేడు చక్రాలనీ ఆరాధించేవాడేగాక, ఇంకా కొందరు బిందువును ధ్యానిస్తుంటారు. ఏది యేమైనప్పటికీ—

వారి వారి గురువులచేత చెప్పబడిన ఆసనా (పద్మ, సుఖాదు)ల యందు దృఢంగా వుండి - మూలాధారాది చక్రాల ద్వారా నిద్రాళువుగా వున్న "కుండలి"ని మేల్కొల్పి, కుంభక, రేచక, పూరకాలనే అభ్యాసాలతో గ్రంథుల్ని బ్రద్దలుకొట్టి - అంటే - చక్రానికీ చక్రానికీమధ్య వుండే జడత్వాన్ని అధిగమింపచేసి, ఆ కుండలిని మాడు పట్టుకు చేర్చి, మామూలు ఉచ్ఛ్వాస నిశ్వాసలకన్నా అతీతమైన - మానసికోచ్ఛ్వాస నిశ్వాసాలతో - తమ ఒళ్ళుపై మరచిపోయి - మహానందంలో లీనమై పోతూంటారు. కాని, వాళ్ళకి పరతత్వం మాత్రం పట్టుబడదు సుమా!

వాళ్ళకేనని కాదు, మూల - ఓఢ్యాణ - జలంధరాది బంధానుసంధానాలు చేస్తూ, ఇడ-పింగళ-సుషుమ్నా నాడుల ద్వారా - పూర్ణగిరీ పుష్కర గిర్యాదిగాగల సాధనాల నమ

రించుకుంటూ, మహా జ్ఞానులుగా ప్రకాశించేవాళ్ళూ, చల - అచల - త్రికూటా చలాదిగా వున్న సిద్ధాంత సాధనలు చేసేవాళ్ళూ - ఇంకా, కాళీ, బిందు, నాద - మొదలయిన వివిధ ప్రక్రియవేత్తలూ - హఠయోగులుగా చెప్పబడుతూన్నారు. ఆ యోగాలు గొప్పవే.. కాని, తద్వారా- ఈ జనన మరణాలు తప్పవే! అంచేత, నువ్వు వాటిమీద మోజుపడకు. మోక్షాన్నే దృష్టిలో పెట్టుకో.

మళ్ళీ చెబుతున్నాను - పైన చెప్పిన- రేచక, పూరక, కుంభనాది వాయు సాధనలే అను - త్రాటక, భుజంగాది సాధనలే అను- ఇవన్నీ నీ చేయబడుతున్న వే గనక-చేయబడే వెప్పుడూ ఆత్మరూపం కావు. అవేనన్న మాటేమిటి, యింకా అనేకమంది చేసే మంత్రోపాసనలు కానీ, ధ్యానోపాసనలు కానీ, లేదా, సమాధియోగాలు గానీ - ఇవేవీ కూడా "నువ్వు"- లేదా - "నేను"— లేదా"ఆత్మ" కాదని తెలుసుకో,

ఈ విధంగా - "ఇదికాదు" - "ఇదికాదు" - అనుకుంటూ — దానికోసం ప్రయత్నించని వాళ్ళూ - ఇదే. మోక్షమార్గమనుకునే వాళ్ళూ - వాళ్ళంతా మందబుద్ధులని గుర్తించు. అదంతా మిడిమిడి జ్ఞానమేగాని — నిఙివెడుజ్ఞానం మాత్రం కాదు.

అసలీ శరీరమే అనిత్యమైనప్పుడు, ఇక దానికి సంబంధించిన కర్మలూ గట్రా యదార్థమెలా అవుతాయి? అంచేత, కంటికగ్పించేది కాని, చెవికి వినిపి చేది గాని, నోటితో

చెప్పగలిగింది గాని, మనసుతో భావించగలిగింది గాని — 'ఆత్మ' కాదు.

ఈ పాంచ భౌతికాలయిన స్పృహాల్ని విడిచిపెట్టు.

ఆదివి నువ్వు. అంతంలేనిది నువ్వు. అవికారుడివి నువ్వు. అమలికు (శబలత్వం లేనివా)డివి నువ్వు— అటు వంటప్పుడు ఆదిలో లేనిదీ, అర్థాంతరంగా అంతమైపోయేదీ, ఆరువికారాలు కలిగిందీ అయిన - యీ శరీరం—ఏ కోశానా "నువ్వు" కాదని — తెల్సుకో.

పుట్టడం, కర్మఫలాన్ననుభవించడం, ఆకారం కలిగి వుండడం, ఒక పేరుని కలిగి వుండడం, పనిచేయడం. వర్ణం — అనే ఏ విధమైన వికారమూ లేని—

ఎడతెఱిపి లేని,

ఏ మినహాయింపూ లేని

ఏకైకమైన వెలుగువి "నువ్వు"

"ను"వ్వి ప్రకృతికి అతీతుడివి.

—మొదటి పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## రెండో పాఠం

గురువుగారీ విధంగా మొదటి పాఠం ముగించగానే, శిష్యుడు, ఆనందబాష్పాలు కుక్కుకుంటూ గురువుగారియొక్క తామరపువ్వుల్లాంటి పాదాలమీదపడి నమస్కారం చేసేశాడు.

"అయ్యా గురుదేవా! ఆత్మజ్ఞానులందర్లోనూ - మొట్ట మొదటిగా చెప్పుకోవల్సినవాడా! భక్తులపాలిట పెరట్లోని పారిజాత (కల్ప) వృక్షంలాంటివాడా! అన్నిరకాలైన విద్యల్లోనూ వేదాల్లోనూ వున్న రహస్యమైన విషయాలన్నింటినీ తరచి తరచి తెల్సుకున్నవాడా! పండితులందరిచేతా పొగడబడేవాడా! నాపట్ల కరిగించి - నా మనోవ్యధని తప్పించావు. నీ పుణ్యమా అని, నేను తీరిన కోరిక కలవాడినయ్యాను.

"స్థూల శరీరం" అనే యీ భయంకరమైన కట్టడిని బద్దలుకొట్టి, దీనుణ్ణయిన నన్ను - నీ కుమారుడికిమల్లే అనుగ్రహించావు.

అయ్యా! గురువర్యా! - అసలు, బాగా ఆలోచించి చూస్తే — ఈ దేహానికి - పెళ్ళాం అనేదే ఒక పెద్ద సంకెల గొలుసు. పిల్లలు - ఆ సంకెలని మనకి శాశ్వతంగా కట్టేసే

మర (సీల)లు. ఈ లంపటంలోంచి బయటపడకండా - మన అవయవాలే మనకి కాపలాదారులు, నిజం చెప్పాలంటే సంసారమే పెద్ద జైలు.

అటువంటి యీ బొందెమీద భ్రాంతిని తప్పించి, నన్ను సమిత్తమాత్రుణ్ణిచేసి — కాపాడావు. నీ ఋణం తీర్చుకోలేనయ్యా" అంటూ పరిపరివిధాలుగా ప్రార్థిస్తూన్న శిష్యుణ్ని - మరి తన్మయపూర్వకంగా చూస్తూ- గురువిలా అంటున్నాడు-

"దానిదేముంది లేరా! నీళ్ళకుండలో - ఆకాశం అనేకరకాలుగా ప్రతిఫలిస్తూంటుంది. మబ్బుంటే మబ్బులాగా. నిర్మలంగా వుంటే నిర్మలంగానూ - కనిపిస్తుంది. అదే విధంగా "అహంకారం" అనే దానివల్ల - అసలు విషయాలేవో తెల్సుకోవడం కాస్తంత కష్టంగానే వుంటుంది.

అయినప్పటికీ యదార్థం చెప్పాలంటే - ఈ లింగ దేహంలో వున్న 'ఆత్మ'ని కానుకోలేకపోవడంవల్లనే, సుఖ దుఃఖాలకీ - స్వర్గ నరకాలకీ లోబడిపోయి, మనుషులు మోక్షాన్ని పొందలేకపోతున్నారు.

నీళ్ళల్లోపడిన సూర్య ప్రతిబింబం, ఆ నీటి కెఱటాల తాకిడికి - యే విధంగా అయితే, ముక్కలు ముక్కలయి పోయినట్లుగా అన్పిస్తుందో—అదే విధంగా - వివిధ శరీరాల్లో విలసించే ఆత్మ కూడా - అనేకాలుగా భాసిస్తుందేగాని — నిజానికొకటే -

బాగా కాల్చబడ్డ ఇనుముని ఆశ్రయించుకున్న కారణంగా - అగ్ని కూడా సమ్మెట పోటుల్ని భరించినట్లు - దేహాశ్రయం కారణంగానే జీవుడు - ఆయా దేహాగత కష్ట సుఖాల్ననుభవిస్తూ, పాపపుణ్యాలకి కర్తగా భాసిస్తూ - ఎనభై నాలుగులక్షల యోనుల్లోనూ మసుల్తూ, చావుపుట్టుకల చక్రభ్రమణంలో యిరుక్కుంటూంటాడు. ఈ "స్థూల దేహాన్ని" అతిక్రమించలేనంతకాలమూ — జీవికి మోక్షం లేదని తెల్సుకో.

అంతేకాదు - దానికి తరంగా వుండే - సూక్ష్మ దేహానివి కూడా "నువ్వు" కాదు. ఇంద్రియ వాసనల్తో వుండే శరీరాలుగాని — తదతిరిక్తాలయిన అంతఃకరణ కాని, మనస్సు గాని, బుద్ధిగాని — ఇవేవీ కూడా "నువ్వు" అనబడే-"నేను" అయిన — "ఆత్మ" కాదని అర్థంచేసుకో—.

అయితే, కొన్ని మతాలవాళ్ళు మాత్రం ఈ"బుద్ధి"నే ఆత్మగా ప్రచారం చేస్తారు. అది తప్పు సుమా! ఆ బుద్ధికి కూడా సాక్షివైనప్పుడే యదార్థమైన 'ను'వ్వనేది 'నే'ననేది. అప్పుడు నీకు అసాధ్యమనేదే వుండదు. నువ్వే బ్రహ్మవు. నువ్వే చైతన్యానివి.

మనం యేయే వస్తువుల్ని భోగించామో, ఆ వస్తువుల పట్ల మమకారాన్నీ — ఆశల్నీ కల్పించేదే "చిత్తం" అనబడుతోంది. దానికి కూడా నువ్వే సాక్షివని తెలుసుకో. ఈ పాంచ భౌతిక శరీరంలో ఎక్కడెక్కడ 'నేను నే'ననే అహం పుట్టుకొస్తుందో - ఏ అహం సుఖదుఃఖాలననుభవిస్తుందో -

ఆత్మకు అత్యంత సన్నిహితంగా అలరారుతుందో, ఆ అహా
నికి కూడా నువ్వే ఆత్మవి.

అంచేతనే - ఆ లింగదేహానికి చెందిన సమస్తాన్నీ -
దాని పతనంతో సహా తెలుసుకోగల వాడివి నువ్వే అవు
తున్నావు.

పువ్వులన్నింటిలోనూ సువాసనలున్నా, దేని వాసన
దానికే ప్రత్యేకంగా వున్నట్లు - అన్ని బొందెలా వుండే
అహంకారాలకి సాక్షిరూపమైన చైతన్యం ప్రత్యేకంగా
వుంటుంది. అయితే 'అహంకారా'నిదే పై చెయ్యిగా
వున్నప్పుడు - ఆత్మ ప్రకాశం అనేది కానుకోలేకపోవడం
సహజం. అందువల్లనే అనేకమంది యీ "అహంకారం" అనే
దానినే ఆత్మగా ప్రచారంచేసి—తదతీతమయిన ఆత్మ మాటే
మర్చిపోతూన్నారు.

సరే, దానిదేముంది! అహంకారం పెచ్చు పెరిగి
నప్పుడు - ఆత్మజ్ఞానం నశించిపోవడం సహజమే కదా!
అయినా, ఇంకోసారి చెప్పేదేమిటంటే - కనపడేకాయంగాని,
కనబడకుండా ప్రవర్తించే చిత్తం, మనసు, బుద్ధి, అహంకారం
అనే నాలుగింటికీగాని. సాక్షివీ - ద్రష్టవీ కూడా నువ్వే
అయిన కారణంగా - ఆ అయిదూ కూడా "నువ్వు" కానే
రావనేది నిర్ధారించేసా్ం. సరే - మనోబుద్ధ్యహంకార
చిత్తాలనే - అంతఃకరణ చతుష్టయం నువ్వు కావని తెల్సింది
గదా— ఇక ప్రాణపంచకం విషయంలోకి వద్దాం.

శరీరం పుడుతూనే ప్రాణంతో వస్తుంది. పోయేటప్పుడా ప్రాణం పోతోంది. ఉన్నన్నాళ్ళూ వుంటోంది. అందువలన – 'ప్రాణమే' "ఆత్మ" అనే వాళ్ళు కూడా కొందరున్నారు. హఠయోగం కూడా ఆ విషయాన్నే ఉటంకిస్తోంది. కాని ప్రాజ్ఞులయినవాళ్ళు మాత్రం దానినంగీకరించరు. 'ప్రాణం' దృశ్యం. 'ఆత్మ' ద్రష్ట. ప్రాణానిక్కూడా ఆత్మే సాక్షి. ప్రాణమే ఆత్మ అయితే - నిద్రపోయేవాళ్ళ శరీరాలమీద సొమ్ముల్ని దొంగిలి చుకుపోతే, ఆ సంగతి ప్రాణం పసికట్టాలి కదా! మరా సంగతి ప్రాణానికెందుకు తెలియదు? అదలా వుంచినా—

నిద్రపోతున్నా, మెలకువగా వున్నా, కలగంటున్నా కూడా ప్రాణవాయువులనేవి మన లోపలా బయటా మసల్తూనే వుంటాయిగదా! ఆ వాయువులే ఆత్మ అయితే, విడిచినప్పుడల్లా మనం విగతులం కావాలి గదా! పైగా, ఇడా పింగళనాడులలోని సంచారంవల్ల కూడా - ప్రాణం ఆత్మకాదని తెలుస్తోంది.

కాబట్టి, హృదయస్థానంలో మసలే ప్రాణంగాని, గుదస్థానంలో వుండే అపానం గాని, గొంతుకలో ఉండే ఉదానం గాని, బొడ్డు ప్రాంతాల చరించే సమానంగాని, సర్వావయవాల్లోనూపహరించే వ్యానంగాని - ప్రాణ వాయువులుగా చెప్పబడే యీ అయిదింటికన్నా వాటికి ఉప వాయువులుగా చెప్పబడే మరో అయిదు గాలులతో కలిపి. పది వాయువులకీ కూడా అతీతంగా ప్రకాశిస్తోంది ఆత్మ.

నిద్ర, మెలకువ, కలగనడం అనే మూడు అవస్థలకీ - వాటి సంధానానికీ, పది ప్రాణవాయువులకీ కూడా సాక్షీ భూతమైనదే ఆత్మ తప్ప - 'నేను నే'ననుకుంటున్నది ప్రాణం కాదని తెలుసుకో.

చెవులు, చర్మం, కన్ను, నాలుక, ముక్కు అనబడే ఇంద్రియాలు గాని - వాటి వాటి విషయాలయిన ధ్వని, తాకిడి, ఆకారం, రుచి, వాసన అనబడేవి గాని - 'ఆత్మ' కావు.

ధ్వని, లేదా, శబ్దాల వలన కలిగే 'జ్ఞానం' గాని - 'వినికిడి' గాని చెవులవి కావు. అలాగే కంటికి కనిపించే దానిని చూసేది 'నువ్వే' తప్ప కన్ను కాదు. వినిపింపచేసే చెవికీ, కనిపింపచేసే కంటికీ యజమానివీ, సాక్షివీ నువ్వే గాని - ఆ అవయవాలు ఆత్మ కావు.

స్పర్శనీ, తద్వారా సుఖసౌఖ్యాలనీ పొందేది మనస్సు. ఆ అనుభూతికి నువ్వు సాక్షివి. నువ్వు చర్మానివి గాని, స్పర్శవి గానీ కాదు.

బుద్ధి - నువ్వు చూసిన దానినీ వినిన దానినీ - పునశ్చరణ చేస్తుందే గాని, మొత్తంమీద అదీ ద్రష్ట కాదు.

నాలుక రుచులను పసిగట్టడానికి సాక్షివి నువ్వేతప్ప— నాలుకా కాదు, రుచీకాదు.

వాసనను పొందే ముక్కుకు సాక్షివి నువ్వే తప్ప, ముక్కూ కాదు - పరిమళమూ కాదు.

ఈ విధంగా ఆలోచించినట్లయితే పంచేంద్రియాలు గాని, వాటి వాటి విషయాలు గాని 'ఆత్మ' కావు. నువ్వు మాత్రమే ఆ సకలానికీ ద్రష్టవి - సాక్షివి. ఇలా 'నువ్వు'గా చెప్పబడే ఆత్మ - నిత్యము. పవిత్రము, సర్వజ్ఞము, ఏ బంధనాలూ లేనిదీ, నిజమైంది, కేవలం ఆనందమే అయినదీ మాత్రమే అయి వుంది. ఆ ఆత్మయే "నువ్వు."

ఇక కర్మేంద్రియాల్ని పరిశీలించుదాం- 'శబ్ద' అనేది- నోటి ద్వారా కలుగుతోంది. దాని ద్వారా తెలుసుకో గలగడం జరుగుతుంది. 'ఆత్మ' ఆ శబ్దంకన్నా అతీతమైంది.

నోటికియున్న ఆరు విచారపోగ్యంతులు - రెండు మాతృకాక్షరాలు, మధ్యమం, తాలువులు, పెదాలు, నాలుక - మొదలయినవేవీ 'నువ్వు' కావు. తత్కారణంగా తద్వారా పలుకబడే నాలుగు రకాలయిన వాక్యాలూ 'నువ్వు' కావు. జ్ఞానంవల్ల నాదాకృతిలో సమస్తమైన వాక్యాలూ జన్మించి, మనసును చేరి ధ్వనులుగా పరిణమించి స్ఫురణం కలుగుతుంది. దానిని 'నువ్వు' నిర్వహించడం లేదు. జీవాత్మ యొక్క ప్రథమస్ఫురణం వేరేవుంటుందని ఆదిలోనే చెప్పాను. కాబట్టి-యేర్పడిన తదుపరి వాక్యం అంతఃకరణగా వుంటుంది. నాదం, ధ్వని, ప్రథమ స్ఫురణం, పరావాక్యం - అనబడే ఈ నాలుగురకాల వాటిచేతా ప్రకటించబడగలిగే వాటన్నిటికీ అతీతంగా వుండేవాడివే "నువ్వు" - లేదా - ఆత్మ-

మనసు సంకల్పించినదానిని - తాకిడి ద్వారా సాధించే "చేయి" అనే కర్మేంద్రియ విషయానికి నువ్వు 'సాక్షి'వే గాని, ఆ 'చెయ్యి' గాని దాని 'చేత' గాని నువ్వు కాదు

అలాగే మనో సంకల్పాన్నిబట్టి 'కాళ్ళు' నడవడం పరుగెత్తడం వంటి పనులు చేస్తాయి. వాటికి నువ్వు ద్రష్టవే తప్ప - 'కాలు'గాని - 'కదలిక'గాని నువ్వు కాదు.

చిత్త ప్రవృత్తి వలన - తదనుగుణేంద్రియంతో రతులు వగయిరా కార్యాలు జరుగుతాయి. వాటికి కూడా నువ్వు సాక్షీభూతుడివే తప్ప - అవి 'నువ్వు' కాదు.

అహంకారం వలన 'పాయువు' మలవిసర్జనం చేస్తోంది. అది కూడా 'నువ్వు' కాదూ.

ఈ విధంగా ఇరవయ్యైయిదు అంశాలతో అవయవ రూపమై ఈ స్థూల శరీరం ఆభాసగానూ - కళ్ళకు కను పించేదిగానూ ఉంటుంది. 'నువ్వు' లింగదేహంకన్నా అతీతు డివి గనక - ద్రష్టవుగనక - ఈ శరీరం "నువ్వు" కాదని తెలుసుకో.

మెలకువగా ఉన్నప్పుడు మనమేమేమి అనుభ విస్తామో, వింటామో, చూస్తామో - వాటి తాలూకు వాసనలు మన మనసుకు పట్టేసి ఉంటాయి. మనకి తెలియకుండానే మనం వాటిని మనలో మననం చేస్తూంటాం. అవి నిద్దట్లో ప్రతిఫలించి - "స్వప్నావస్థ"గా పరిణమిస్తోంది. మమకారం; దృష్టి, ఆకారం, చూసినదీ, విన్నదీ యివన్నీ ఒక్కటై కలిసి వంటకాల వాసన, పాత్రల కంటినట్లు - భరణిలో కర్పూరం తీసివేసినా - తత్పరిమళం ఆ భరిణెనంటిపెట్టుకుని ఉన్నట్లూ - పై చెప్పినవన్నీ - కలగా

వచ్చి, ఆ అవస్థలో నున్నంతసేపూ - అదే నిజమనిపిస్తుంది. ఆ అనుభవాన్ని చెప్పడం కష్టం. అనుభవనీయమే తప్ప భాషకి అందేది కాదు.

మనం నిద్రపోయేటప్పుడు - బుద్ధిని అధిరోహించి, తాను మెలకువగా ఉండే 'చిత్తం' కలగా కనిపిస్తూంటుంది. ఈ స్వప్నావస్థను నువ్వు చూస్తున్నావు. శరీరం నిద్రిస్తోంది - కళ్ళు మూసుకుని వున్నాయి. అయినా చూడబడింది. అందువల్ల, ఈ స్వప్నావస్థకన్నా సర్వం సహా శుద్ధుడివైన "నువ్వు" లింగదేహానివే మాత్రమూ కావు అని తెలుసుకో.

ఇంకో విషయం - కలకీ, ఈ స్థూల దేహంలోని సూక్ష్మ దేహానికీ - సూక్ష్మదేహాన్ని కప్పేసిన స్థూలదేహానికీ వీటి మెలకువలకీ, నిద్రలకీ - అన్నింటికి నువ్వే అధినాథుడివైన కారణంగా - ఆ రెండూ గాని - ఆ సమయాలు గాని - అవస్థలుగాని "ఆత్మ" కాదు.

ఇచ్ఛాశక్తివల్ల గొంతుపలికే "శబ్దం" గాని, తదర్థం గాని - ఆత్మ కాదు.

అబ్బాయీ! అగ్నిసంపర్కంవల్ల, లోహాలు కూడా ప్రకాశించినట్లుగానే—

చెవులు వింటాయి, చర్మం స్పర్శ ద్వారా సుఖానుభూతిని పొందుతుంది. కళ్ళు చూస్తాయి. నాలిక రుచులని అనుభవిస్తుంది. ముక్కు వాసనల్ని పసిగడుతుంది. ఇవన్నీ నీకు అనుభవాలే కదా!...

అలాగే— వాణింద్రియం మాట్లాడ్డం కాని, చేతులు తమ వాసనలయిన ఇచ్చిపుచ్చుకోడాల్లోగాని, కాళ్ళు - అటూ యిటూ తిరగడంలో గాని, మర్మావయాలనుభవించే అశ్లీలసుఖాల్లోగాని, పాయువులు వగయిరాల ద్వారా జరిగే మలమూత్ర విసర్జనంగాని - అన్నీ నీకు ప్రత్యక్షాలే కాబట్టి - అవేవీ నువ్వు కావు.

ఆయా యింద్రియాలు ఆయా పనులు చేసుకుపోతుంటాయే తప్ప - నీకేమీ సంబంధం వుండదు. అంచేత- అవేవీ నువ్వు కాదని తెల్సుకో...

విధులన్నింటికీ అహంకారం, ఆ విధి నిర్వహణా విధాన రచనకి చిత్తశుద్ధి, ఆయా నిర్ణయాలకు బుద్ధి, సంకల్ప వికల్పాలకి మనసూ స్థానాలుగా వున్నాయి.

అయితే ఓం ప్రథమంగా 'స్ఫురణ'మనేది అంతఃకరణంలోనే జరుగుతుంది. అందుకు కూడా నీవే కర్తవని భావించుకున్నంతకాలం నీయొక్క యదార్థ రూపాన్ని నువ్వు తెలుసుకోలేవు. అంతేకాదు, సర్వేంద్రియాలచే చేయబడే పనులకీ, పాపపుణ్యాలకాలవాలంగా బాధ్యతాయుతంగా నిర్వర్తించే కర్మకాండలతోనూ కూడుకున్న సంసారానికి బంధించబడతావు. పైపెచ్చు "సంసారులమయ్యాక తప్పదు గదా" అనుకుని, నీమీద నువ్వే జాలిపడుతూ - సర్వద్రష్టవీ, సాక్షివీ అయ్యుండి కూడా - నిన్ను నీవు తెలుసుకోలేవు.

అందువల్ల స్థూల - సూక్ష్మ శరీరాలవల్ల యేర్పడే బంధనాలన్నిటినీ తిరస్కరించు. 'మాయ' అంటే యేమిటో తెల్సుకో, అధిగమించు. అప్పుడే అజ్ఞానాన్ని జయిస్తావు.

ఏది అశాశ్వతమో, దాని గురించి విచారించడం వృథా సుమా! కలలో ఏదో పాపం చేసామని, మెలకువ వచ్చాక ప్రాయశ్చిత్తం చేసుకోవలసిన పనిలేదుగదా! ఈ రెండు శరీరాలవల్లా చేయబడ్డ పాపపుణ్యాలేవైతే వున్నాయో - అవన్నీ కూడా - ఆత్మజ్ఞానంతో నశించి పోతాయి.

ఆ పాపపుణ్యాల పద్దులెప్పుడు — మూసివేయబడతాయో, అప్పుణ్ణీకు స్వర్గనరకాల ప్రసక్తి కూడా దూరమై పోతుంది.

అంచేత - 1. ఉన్నట్లుగా అనిపించే స్థూల సూక్ష్మ దేహాలకి 'నువ్వు' అతీతుణ్ణని తెలుసుకో.

2 మంచి పనులవనీ, చెడ్డ పనులవనీ - వాటికి నువ్వు సాక్షీ భూతుడివే గాని కర్తవి కావు.

3. అవయవ భూయిష్ఠాలైన దేహాలలో నువ్వు - అవయవరహితుడవైన నువ్వు ఏకాంగు వీరుడివి—

— అని గుర్తించి - దేహాభిమానాన్ని తృణీకరించి, ఆత్మతత్వానుభవాన్ని పొంది. సంసార భయాల్నుంచి ముక్తుడివై, నిత్య — సత్య - సుఖాన్ని పొందు."

—రెండవ పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## మూడో పాఠం

శిష్యా! లింగ (స్థూల) దేహం గురించీ, సూక్ష్మ దేహం గురించీ. నువ్వు తెలుసుకున్నావు. ఆ రెండు శరీరాలకీ కూడా నువ్వు సాక్షిమాత్రుడవే గాని, ఏ శరీరమూ కూడా నువ్వు కాదు.

ఇంతవరకూ అజ్ఞాన భూయిష్ఠమైన తెలివిని గెలిచి - పై చెప్పిన రెండు కళేబరాలకీ అతీతుడిగా నిన్ను నువ్వు తెలుసుకున్నావు.

అదే విధంగా - ఇంకిప్పుడు నువ్వు గెలుచుకు రావాల్సిన జోడాల గురించి చెబుతాను విను.

మొదటి జంట - రాగ, ద్వేషాలు-
రెండో జంట - సుఖదుఃఖాలు-
మూడో జంట - సంకల్ప - ప్రయత్నాలు
నాలుగో జంట - పుణ్య - పాపాలు

అంటే - ఒకరిపట్ల, లేదా, ఒకదానిమీద అతి ఇష్టం, ఇతరాల మీద పగవంటివి పనికిరావు. ఈ రెండింటిలో ఏ ఒక్క-దానికి ఆసరా యిచ్చినా, రెండో అవగుణం సంప్రాప్తించి తీరుతుంది. తస్మాత్ జాగ్రత్త

ఇక రెండో జత – సుఖదుఃఖాలు, వేటిని సుఖాలుగా భావిస్తామో - వాటికి అవతలివన్నీ దుఃఖాలుగానే భాసిస్తాయి. లేదూ. దేనికి దుఃఖపడుతున్నామో - దాని కన్నా యితరమైనది 'సుఖ'గా కనిపించి, దానిని పొందాలనే ఆశ తద్వారా యిష్టం - తద్వారా ద్వేషం కలుగుతాయి. అందువల్ల - ఈ సుఖదుఃఖ భావాన్ని పూర్తిగా తుడిచి పెట్టేయాలి.

మూడో జోడా - సంకల్పం - ప్రయత్నం. దేనినీ సంకల్పించకూడదు. ఇలా చేద్దాం, అలా చేద్దాం అనే ఆలోచనలు రానివ్వకూడదు. అలా కల్పించినట్లయితే, వాటిని ఖచ్చితంగా ఆచరించి తీరాలి. లేకపోతే 'అసత్య సంకల్ప' దోషం వస్తుంది. సంకల్పం కలిగితే సాధనకి ప్రయత్నం చేయడం తప్పదు. ప్రయత్నిస్తే ఫలితాన్ని సంకల్పించక తప్పదు తద్వారా కర్మఫలాశ, అందువల్ల ఇతరేతర ఆధ్యాత్మిక విరుద్ధ భావాలేర్పడ్డం జరగవచ్చును. ఆ కారణంగా సంకల్పాన్నీ - తత్ సాధనా ప్రయత్నాన్నీ విరమించాలి.

కడపటిది - పాపపుణ్యాలు. పాపం వలన నరకం' పుణ్యం వలన స్వర్గం అని చెబుతారు. తద్వారా నరకానంతరమో - స్వర్గ సౌఖ్యానంతరమో - మళ్ళీ పుట్టడం, ఈ సంసారంలో పడి ఈదుకొట్టడం, చివరగా చావడం - చేసిన కర్మానుసారం స్వర్గనరకానుభవాలూ - "పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం". తప్ప-ఆత్మజ్ఞానం గాని, మోక్షం గాని లభించదు. అందువల్ల పాపం

గాని, పుణ్యం గాని - దేనికయినా దూరంగా వుండడమే శ్రేయస్కరం.

ఈ ఎనిమిదింటికీ పైది అజ్ఞానం. స్థూల సూక్ష్మ దేహాలకూ ఆత్మకూ సంబంధాన్ని భావింపచేసే అత్యంత శత్రువైన అజ్ఞానం నశించనిదే - జ్ఞానం కలగదు - జ్ఞానహీనుడికి మోక్షమూ కలగదు. కాబట్టి - ఈ అవివేకాన్ని అతిక్రమించగలగాలి. కాని పక్షంలో - ఏదైతే జ్ఞానం కాదో, దానిని జ్ఞానంగా భ్రమింపచేస్తుందిది. మరింత బలీయమైన ఈ అజ్ఞానం యెప్పుడు నశిస్తుందయ్యా అంటే - ఆత్మజ్ఞానం వల్ల మాత్రమే నశిస్తుంది.

ఒక్క విషయం చెప్పు - స్థూల సూక్ష్మదేహాల గురించి తెలుసుకున్నావు. "నువ్వు" ఆ రెండింటికన్నా వేరైన లక్షణాలు కలవాడిగా అంగీకరిస్తున్నావు. అంటే - ఈ లింగ దేహాన్నీ, సూక్ష్మదేహాన్నీ కూడా అర్థం చేసుకున్నావు. వాటికంటే ఇతర లక్షణుడిని అంటే - నీ లక్షణం కూడా నీకు తెలిసేఉండాలి. ఏదీ ఇప్పుడు చెప్పు. నువ్వెవరు?-

గురువలా అడగడంతో - మొదట శిష్యుడు రవంత తడబడ్డాడు. అతని మనసు ఏం చెప్పాలో పాలుపోక, కాస్తంత అటూ యిటూ కూడా ఊగులాడింది. చివరగా ధైర్యం తెచ్చుకుని ఇలా చెప్పసాగాడు.

"గురువుగారూ! నేనీ స్థూలదేహంకన్నా విలక్షుణుడిని. అలాగని సూక్ష్మ దేహంకన్నా కూడా యితరుణ్ణి. కాని - "నేనేమిటి?" అని ఎంత ఆలోచించినా తెలియడం లేదు. ఈ

శరీర నిర్మాణ మూలకాలయిన నిప్పూ - నీళ్ళూ - నేలా - ఆకాశం - గాలీవంటి పంచభూతాలుగానూ లేను. ఆ భూతాలనీ, ఆయా భూతాలయొక్క ఇరవయ్యయిదు అంశలకీ నేను ద్రష్టనయిన కారణంగా, అవి కూడా నేను కాను. కేవల ప్రాపంచిక భూత సమూహాలతో తయారయిన రెండు శరీరాలనీ కాను.

గురుదేవా! ప్రాణాపాన వ్యానోదాన సమానాలనే అయిదు ప్రాణ వాయువుల్నీ కాను. దృక్ర్శవణ చర్మ వర్ణనాసికాది జ్ఞానేంద్రియ పంచకం గాని, వాటి వాసనలు గాని నేను కాను. కరచరణ వదన గుదపాయ్వాది కర్మేంద్రియాలు కూడా నేను గాను. అంతఃకరణాన్నీ గాను.

గురుపాదా! మనసుయొక్క గమనాన్ని, దానిపట్ల బుద్ధియొక్క నిర్ణయాధికారాన్ని, ఆపై చిత్త విన్యాసాన్ని, అహంకారాన్ని - ఇవేవీ కూడా నేను కాను.

నేనే శరీరాలను కాను. తద్వారా - ఈ శరీరాలచే పొందబడిన జ్ఞానాన్నీ కాను. నేను మూర్తినీ కాదు. లేని వాడిని కాను. స్థూల, లింగ దేహాలకు సాక్షిని, ఈ రెండింటికీ అతీతుడిని.

అయ్యా! నాకిదంతా తెలిసిపోతోంది తప్ప విడిచి, నేనెవర్నో మాత్రం నాకేమీా తెలియడం లేదు. దయచేసి నన్ను నాకు చూపించండి" అని, గురు పాదాలపై వ్రాలి పోయాడు.

అతని వినయానికీ, విషయజ్ఞతకీ ముచ్చటపడిన గురువు- "చేబాసురా శిష్యా! ఈ రెండు శరీరాల గురించీ నీకు తెలిసిన 'అజ్ఞానం' వల్లనే అసలయిన "ఎఱుక"ని అందుకోలేకపోతున్నావు అందువల్లనే - నువ్వు - ఏమిటో, నీకు తెలిసినా కూడా, ఏమీ తెలియదని బిత్తరపోతూన్నావు

ఈ శరీర లక్షణాలే ఇంత! యదార్థానికి జ్ఞానివైన నీకు, ఈ మేనుల వల్ల ప్రాప్తించిన అజ్ఞానంవల్లనే - నువ్విలా మాట్లాడుతున్నావు నీకు నువ్వు తెలియకపోవడమేమిటి? సర్వాధిష్ఠాతవి నువ్వు.

ఏదీ! ఇప్పుడు చెప్పు - నువ్వు స్వయం ప్రకాశుడివి, సత్ భావుడివి, వేదమూర్తివి, కర్తవి, ఈ జగత్తంతా కల్పించిన మాయకి - మూలమైనవాడివీ, ఆశ్రయమైనవాడివీ నువ్వు.

ఒక్కొక్కసారి త్రాడును చూసి పామనుకుని భ్రమపడినా, అది కదలిక లేనిది గనక, త్రాడుగా తెలుసుకుంటావు. అలా త్రాడుని చూసి పామనుకున్నట్లుగా, పాముని చూసి త్రాడనుకునే అవకాశం లేదని గుర్తించు. అసత్యమైన 'అజ్ఞానమే' జ్ఞానంగా భావించుకోవడంవల్లనే - అసత్యమయినదంతా సత్యంగా అనిపిస్తూంటుంది.

అయినా - నిత్యమూ యిల్లా - "నేనెవరో నాకు తెలియదు. నన్ను నేను ఎఱుగను" అనుకుంటూ పరితపించడం కూడా అజ్ఞానమేనని తెల్సుకో. అది జడీభూతుణ్ణి చేస్తుంది సుమా! ఒకోసారి అత్యంత స్పష్టమయిన సత్యాన్నే -

ఉపమించడానికి వీలుకాని అసత్యం ఆశ్రయించి కూర్చుం టుంది.

స్థూల, సూక్ష్మ ప్రపంచాలు రెండింటినీ కావనుకొన్న తరువాత కూడా, నిన్ను నువ్వు తెలుసుకోలేదనడం సబువు కాదు. ఇదిగో, ఏ విధమయిన రంగూ లేనిదీ, ఏ విధమైన మూర్తికానిదీ, అభావమైనదీ, ఏ ఆధారం లేకండా వున్నదీ అయిన దానినూహించుకుని భ్రమపడుతూన్నావు సుమా! చూడు, అన్నిరకాలయిన వివాదాలకీ నువ్వు అతీతుడివి. లేని అజ్ఞానాన్ని తలకి చుట్టుకుని, "నన్ను నేనెఱగ"నంటావేమిటి?- అలా అంటే అజ్ఞానివనే అర్థం గాని, ఇతరం కాదు.

నీళ్ళల్లో నాచుపుట్టి, క్రమంగా నీటి పైభాగాన్నంత టినీ క్రమ్మేసినట్లు, నీ యదార్థ రూపానికి - మిథ్యాయుత మయిన అజ్ఞానం కప్పేసి వుంది. ఈ శరీరాల వలన యేర్పడే విపరీత జ్ఞానం యిదే. కారణ శరీర కారణోద్భూతమయ్యే ఈ అజ్ఞానానికి శరీరాల్ని నిరసించిన నీవు కారణ శరీరుడివి కానందువల్ల, ఈ ప్రపంచానికీ శరీరమేలాగో నీ శరీరంలో నువ్వు అజ్ఞానికి సాక్షీభూతుడివిగా ఉంటున్నావు. నాయనా! సాక్షివీ, చైతన్యుడివి, కేవలం పరమాత్మ స్వరూపుడవూ అయివుండి కూడా, "నన్ను నే నెఱగ"ననడం అజ్ఞానం గనక- ఆ మాటని ఉపసంహరించుకో.

ఎఱుకనే జ్ఞానం అంటారు. అదే శాశ్వతమైంది. అనిత్యమయ్యేందీ మరుపును కలిగిందీ యే అజ్ఞానం. కాబట్టి జ్ఞానాన్నే శరీరంగా ధరించి వర్తిల్లు.

పనికిమాలిన అజ్ఞానము జంటని అలంకారంగా ధరించ కూడదు జం టేమిటి ? అంటావా ! విను - 1. తెలివితక్కువ తనం, 2. దానివల్ల పుట్టే అతి తెలివి. ఈ రెండింటివల్లా ఏర్పడ్డ శరీరాల్ని ఎప్పుడూ అభిమానించకు. అవి అశాశ్వ తాలు. ముఖ్యంగా నిద్రావ్యసనభరితాలైన వీటిని నిరసించు.

అజ్ఞానమే నిద్ర. శరీరం వివిధావస్థల్ని పొంది, ఇంద్రియాలు చేసిన పనులవల్ల అలసిపోయిన మనస్సు - డస్సి - తమ కృత్యాల నుండి తత్కాలం విరమించుకోబడిన అవయవాలూ - ఇది నిద్రారూపం.

మనోబుద్ధి చిత్తాహంకారాలనే నాలుగు అంతః కరణాలూ - జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలు ఏదీ - తెలివి, అతి తెలివి - అన్నీ కూడా తెలివిలేని తనంలో సోలిపోడమే నిద్ర. ఆ నిద్రకు సాక్షియైనదే "నువ్వు"

నిద్ర, మెలకువ, కలలనే మూడు అవస్థలకీ — బుద్ధికీ — బీజానికీ — కారణాంశాలకీ అన్నింటికీ నువ్వే సాక్షివి. ఆనంద-భోగాలకి కుదురైనది హృదయం. దానికీ నువ్వే సాక్షివి: ఇలా 'నువ్వు' కానివన్నీ తమోగుణ ప్రకా శితాలే గనుక, శుద్ధుడవైన నువ్వు అవేవీ కావని తెలుసుకో.

అబ్బాయ్! స్థూలం, సూక్ష్మం, కారణం అనే మూడు రకాల శరీరాలు - నిద్ర మెలకువ కలలనే మూడవస్థలు - మూడు అభిమానాలు - ఆనంద భోగత్రయం - కళ్ళూ - గొంతూ, హృదయాలనే మూడు స్థానాలు - ఇచ్ఛాజ్ఞాన

క్రియాశక్తులనే మూడున్నూ - వీటన్నిటినీ తెలిసినవాడివీ, వీటికి సాక్షివీ నువ్వే.

అయినప్పటికీ అజ్ఞానం నిన్నాశ్రయించి - సత్వరజస్తమో గుణాలు మూడింటినీ కల్పించి - ప్రపంచ రచనని నిర్వర్తిస్తూంటుంది. ఈ రహస్యాలను తెలుసుకుంటేనే తప్ప చావు పుట్టుకల ఝంఝూటంలోంచి బయటపడలేము. నాయనా! అందువల్ల శుద్ధసత్వాన్ని అలవర్చుకో. సర్వేశ్వరుడవు - సర్వసాక్షివీ - సర్వ వ్యాపకుడివీ అయిన నిన్ను నువ్వు తెలుసుకో.

—మూడో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## నాలుగో పాఠం

గురువు చెబుతున్నాడు—

స్థూల సూక్ష్మ కారణ శరీరాలు మూడింటి గురించీ, వాటి అవస్థలు, అభిమానాలూ వగయిరాలు తెలుసుకున్నావుకదా! ఇంకిప్పుడు 'మహాకారణ' శరీరం గురించి చెబుతాను విను.

ఈ మహాకారణ శరీరానికి - సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులనే పంచబ్రహ్మలే భూతాలుగా వర్తిస్తారు. నివృత్తి, ప్రతిష్ఠ, (అ)విద్య, శాంతి, శాంత్యతీతలనే కళలే - పంచ విషయాలుగా వుంటాయి. పరా, ఆది, జ్ఞాన, ఇచ్ఛ, క్రియలనే శక్తిపంచనమే ప్రేరేపణలయిన పంచ ప్రాణాలుగా ప్రవర్తిస్తాయి. పంచాక్షరీ మంత్రాక్షరాలే దీనికి పంచేంద్రియాలు. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడూ అనే పంచకర్తలే అంతఃకరణాలుగా అలరారుతుంటారు.

ఈ విధమైన ఇరవయ్యయిదు తత్వాలతో వర్ధిల్లే మహాకారణ దేహానికి 'తురం' అనేది అవస్థ. అభిమాని ప్రత్యగాత్మ. జ్ఞానశక్తికి శు సత్త్వమే గుణం. శిరో స్థానమే ఆనంద - అవభాస - బో ం, ఓంకారమే మాతృక. వీటిలో

వ్యాప్తమై వుండే ఆత్మని నిర్మలాత్మ అంటారు. కూటస్థము, చైతన్యమూ అయిన దీనియందే ప్రణవం (ఓంకారం) నిబిడీకృతమై వుండడంవల్ల - దానినే మూల ప్రకృతి అంటారు. దీనికీ పదీ సంజ్ఞలు.

జ్ఞానసారం తెలిసినవాళ్ళు - పూర్వ దేహాదులకు మల్లేనే, ఈ మహా కారణాంగాన్ని కూడా పరిశీలించి, తరించి, స్వస్వరూపాన్ని వరించి - ప్రకాశవంతమైన నిశ్చలత్వాన్ని పొందుతారు. ముఖ్యంగా, దీని అవస్థయైన తుర్యాన్నీ, అభిమానియైన ప్రత్యగాత్మనీ అధిగమించగలిగితే అన్నింటినీ అతిక్రమించినట్లే అవుతుంది.

ఎందుకంటే - పైన చెప్పిన పది సంజ్ఞలకీ, ఈ మహా కారణ తనువు యొక్క ఇరవయ్యయిదు తత్వాలకీ, ప్రత్యగాత్మకీ, తుర్యావస్థకీ కూడా 'నువ్వే' సాక్షివి గనుక.

ఇక మతాంతరాల్ని పరిశీలిస్తే - 'శూన్యమే ఆత్మ' అనే సిద్ధాంతం ఒకటుంది. క్షపణక మతస్థులు - "ఆత్మలోనే ఆనందానుభవం పొందడమంటే - శూన్య స్వభావమే"నని ప్రతిపాదిస్తారు. అవన్నీ పట్టించుకోకూడని మాటలు సుమా! ఎందుకంటూ వేమో !-

— తెరిపిలేని తెలివే రూపంగా భాసించేటప్పుడు - అది శూన్యమెలా అవుతుంది! పైగా ఆత్మ ప్రకాశమానమవుతూండగా - దానని శూన్యమనడం భావ్యం కాదుగదా! పోనీ, ఎంత తరచి చూసినా ఆ వెలుగులో 'యేమీ లేదు' అనే చెప్పదలుచుకున్నా కూడా - దేనినైతే లేదు అంటు

న్నామో - అదే దానికి రూపమవుతుందిగదా! 'రూపం' శబలమవుతుందే గాని - శుద్ధం కాదుగదా! అందువల్ల ఆ క్షపణక తీర్మానం క్షణికో(ద్రేక మే గాని, శాశ్వత సిద్ధాంతం కాదు. అదలా వుండగా - 'సుప్త' దర్శించడంకోసం మహా కారణాంగంపడే అవస్థే "తుర్యం" అనబడుతూంటే - ఆ అవస్థగాని, తదభిమానమైన ప్రత్యగాత్మగాని నువ్వెలా అవుతావు? నువ్వు కావు

అబ్బాయ్! ఇంతవరకూ చెప్పబడిననాలుగు కాయాలూ ఖాయమైనవి కావని గుర్తించి, వాటిని తృణీకరించడంవల్లనే "శుద్ధ" మైన నిన్ను నువ్వు పొందగలుగుతావు.

అప్పుడు - సర్వభూతాలలోనూ ఉన్న నువ్వు నీకర్థమవుతావు. ఇప్పుడు నువ్వు "గురువుగారికి నామీద ఎంత అభిమానమో" అనుకుంటుంటావు. కాని నిజాన్ని గుర్తించగానే నేను నీ ఒక్కడి నేపట్లనే గాకండా, అన్నిటిపట్లా అదే విధంగా ఉన్నానని తెలుసుకోగలుగుతావు ఈ భోగాలూ వగయిరాలన్నీ సర్వవ్యాపకాలనీ- ఆ సర్వవ్యాపకత్వం కూడా నీ దేనని బోధపడుతుంది. ఇలా నేను చెప్పే విషయాలు వినగానే సరిగాదు. ఈ జ్ఞానంతో నువ్వు స్వానుభావాన్ని పొందాలి. తద్వారానే నిన్ను నువ్వెందుకోవాలి.

గురువు చెప్పిందంతా విని - శిష్యుడు అడగసాగాడు..

"గురుదేవా! అన్నింటా వున్న 'ఆత్మ' ఒక్కటే ననడానికి ఆధారమేమిటి? అంతా ఒకటే అయితే అవతలి వాళ్ళ సుఖదుఃఖాలు నాకెందుకు అనుభూతాలు కావడం

క్రేమ. సమస్తానికీ ద్రష్టనీ, సాక్షినీ నేనే అయితే – ఇతరేతర స్థానాలలోనివీ – నాకంటే విలక్షణంగా వుండేవీ అయిన వస్తు విషయాలు నా బుద్ధికెందువల్ల తెలియడంలేదు ?"

శిష్యుడి ప్రశ్నకి చిరునవ్వు నవ్వుతూ – గురువతడిని సమాధానపరుస్తున్నాడు.

"ఆత్మ" ఒక్కటేరా అబ్బాయ్. ఒకే ఒక్క ఆకాశం విశ్వవ్యాప్తమై – ఆయా ప్రాంతాలలో– ఆయా రకాలుగా ద్యోతకమవుతున్నట్లే – ఆత్మ కూడా ఆయా భూతాల ఉపాధి ననుసరించి అనేకమనే భ్రమని కల్పిస్తూంటుంది.

సూర్యుడొక్కడే. కాని, వివిధ నూతుల్లో, చెరువుల్లో, నదుల్లో, వాగుల్లో, వంకల్లో, సముద్రాల్లో ప్రతిఫలించి అనేక మందిగా కనుపించడంలేదు. అంతేగాకండా - ఆయా స్థానాల లోని నీళ్ళు - శక్త్యనుసారం చలించినప్పుడు ఆ ప్రతిబింబం వికలమై అనేకానేక శకలాలుగాకూడా కనబడుతోందిగదా! అంతేనేగాని – ప్రతిబింబాలెన్ని వున్నాయో, అందరు సూర్యులు లేరుగదా ! ఇక - ఈ నీళ్ళ అలలవల్ల ఎన్నెన్ని ముక్కలుగా తోచినా - నిజానికి సూర్యుడు నిశ్చలంగా, నిరామాయంగా, ఏకాకృతితో ఆకాశంలోనే వుండడం నీకు తెలుసు. అక్కడ నిశ్చలంగానే వున్నా - ఇక్కడ చంచలమైన జలాల్లో ప్రతిఫలించడంవల్ల – తత్ ఉపాధి ధర్మంగా మాత్రమే అలా కనిపిస్తాడు. ఆత్మ కూడా అంతే ..

మాయవల్ల, అజ్ఞానంవల్ల ఆత్మ వివిధంగా భాసిస్తుందే గాని, నిజానికది ఒక్కటే.. కర్మానుసారంగా ఏర్పడే జన్మాల,

ఆ జన్మలో ప్రాప్తించే సుఖదుఃఖాది వికారాలూ స్థూల దేహానికే గాని, నీకు లేవని ముందే చెప్పానుగదా! ఆ స్థూల కాయం పూర్వ కర్మానుసారంగా ఆచరించే కర్మకాండలవల్లా, పొందే సుఖ దుఃఖాలవల్లా వికారాలవల్లనే విభేదం తోస్తోంది.

ఇ తెందుకు? ఎవరి కర్మానుసారం ఎవరి కష్టసుఖాలు వాళ్ళనుభవిస్తున్నారే గాని, ఇతరుల ననుభవించడం లేదు గదా! అలాంటప్పుడు ఇతరుల కష్టసుఖానుభూతి నీకు కలగనంత మాత్రంచేత - ఆత్మ లేదనుకోకూడదు. ఒకొక్కతరహా దుస్తుల్ని కట్టుకున్నప్పుడల్లా — ఒకొక్కలా అనిపిస్తుందీ ఒళ్ళు. వస్త్రభేదమేగాని - అందులో వ్యక్తి ఒక్కడే అయినట్లు — వివిధ భూతాంతస్థితమైన ఆత్మ ఒక్కటే.

మరుపు, జ్ఞాపకం - చిత్తానికి చెందినవేగాని ఆత్మకు సంబంధించినవికావు. ఇంకా మనసు, బుద్ధి వాటి గుణాలు అన్నీ కలిపే లింగదేహమని చెప్తే వున్నాను కదా! అయినప్పటికీ - శరీరాల భేదంవలన - చిత్తప్రవృత్తులు భిన్నాలవుతాయి. జ్ఞానంతో ఆ చిత్త ప్రవృత్తుల్నీ, ఆ ఉపాధుల్నీ విచారించి చూడు. మెలకువగా వున్నప్పటి స్పృహ, కలగనేటప్పుడు వుండదు. కలలోనూ, మెలకువలోనూ ఉండే స్పృహలో నిద్రలో వుండవు కాబట్టి అవస్థాపరంగా ఏర్పడే- లేదా - అవస్థల్ని కల్పించే చిత్త ప్రవృత్తిని తెలుసుకోడం అంత తేలిక కాదు. అథవా తెలుసుకున్నా, అది విపరీతమై- ప్రపంచాన్ని జయించడం మొదలయిన మహిమల్ని ఆపా

దిస్తుందేగాని మోక్షమిస్తుందా! అనేది ఆలోచించుకోవాలి. అలాగే త్రికాలజ్ఞానం సిద్ధించడం ఒకటి. జరిగింది, జరుగుతున్నదీ, జరగబోయేదీ తెలుసుకోడం. దీనివల్ల కూడా జన్మరాహిత్యం సిద్ధించదు. పైగా ఈ యోగాన్ని (యోగఃచిత్తవృత్తి నిరోధకంః) సాధన చేయడానికి ఎంత కాలం పడుతుందో చెప్పలేం. అంతా చేశాక సిద్ధించనూ వచ్చు - లేదా - సిద్ధించకనూ పోవచ్చును. అయినా అసలిలాటి శక్తులూ, మహిమలూ వగైరాలని జ్ఞానమనాలో, అజ్ఞానమనాలో నువ్వే ఆలోచించు. ఒకవేళ అదే జ్ఞానమని ఎవళ్ళయినా అంటే - వాళ్ళు మందబుద్ధులేనని తెల్సుకో. మరీ ముఖ్యంగా, ఆత్మ విద్యను పొందడానికి - సర్వాన్నీ నిరసించాలేగాని - మనోపాసనా, నేత్రోపాసనాలాటివేమీ అక్కర లేదు.

అన్ని విషయాల్నీ పసిగట్టేది చిత్తం. దానికి నువ్వు సాక్షివి - అనేది మర్చిపోకు. చూపున్న అన్నికళ్ళకీ సూర్యుడెలా వెలుగిస్తున్నాడో - అదే విధంగా సర్వేంద్రియాలనీ ప్రకాశింపచేసే 'ఆత్మ'ని మరేదో ప్రకాశింపచేస్తుందనుకోడం అవివేకం.

ఆత్మ యేనాడూ చలించదు. చేష్టించదు. చేష్టతను వహించదు. కర్మను చేయదు - చేయించదు. ఏదీ బోధించదు - బోధించనివ్వదు - బోధించడానికి సాధ్యమైనదీ కాదు. ఈ ప్రకృతిలో సంభవించే సుఖ దుఃఖాలన్నీ - ప్రకృతి సంబంధితాలే తప్ప - యదార్థానికి నువ్వు సర్వోపాధి వినిర్ముక్తుడివి. సుఖ దుఃఖాల్లేనివాడివి. సత్తామాత్రుడివైన నువ్వే లేని పక్షంలో ఇంద్రియాలు చేష్టించలేవు.

చూపు, చూసేదీ, చూడబడేదీ అనేవేవీ కూడా నువ్వు కావు. సత్తామాత్రుడివి. శూద్ధుడివి, నిరంజనుడివి. త్వంపదార్థ పరిశోధనలోనే — అనేకమైన విధానాలున్నాయి. అవన్నీ అధిగమించాక వాటికి సాక్షివవుతావు నువ్వు. అందువల్ల - పారమార్థికపరా ! - సమతత్వ (తత్ త్వం) పదాన్నే సాధన చేయాలి. దానివల్ల జీవితంపట్ల నిరసన కలుగుతుంది. ఆత్మ జ్ఞానమనే సత్య ప్రకాశం కలుగుతుంది.

'దృశ్యం' అనే మకిలిపట్టిన లోహాన్ని, జ్ఞానమనే పుటంలో వేసి శుభ్రపరచి బంగారంగా సంగ్రహించినట్లు నీ నిజరూపాన్ని తెలుసుకో. ప్రాపంచిక లంపటాలనే మురికిని వివేకమనే నీళ్ళతో కడిగి స్వయం ప్రకాశమైన ఆత్మని తెలుసుకో. అరటిపండు తొక్కని తీసిపారేసి, లోపలి సారాన్నే ఆరగించినట్లుగా - మాయామయమైన శరీరమనే మట్టి బట్టని విప్పి అవతల పారేసి - నిన్ను నువ్వు నగ్నంగా చూసుకో - శుభంభూయాత్ !

—నాలుగో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## అయిదో పాఠం

సుకోవాచ :-

ఇంతవరకూ జీవుడికి చెందిన స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరాలు నాలుగింటి గురించీ చెప్పాను. అవి ఎందుకు ఆత్మకావో కూడా చెప్పాను. అలాగే ఇప్పుడు దేవుడి దేహాలు నాలుగింటి గురించీ వినిపిస్తాను విను.

ఆ దేవ భేదాలెప్పటిదాకా గుర్తించలేమో - అప్పటి దాకా విద్యాద్వైతాలైన వాసనలు వదలవు సుమా! ఉత్కృష్టుడైన జీవుడికిమల్లేనే, మహోత్కృష్టుడైన దేవుడి కూడా నాలుగు రూపాలు చెప్పబడుతున్నాయి. నీ నాలుగు దేహాల్నీ పరిహరించినట్లే, తత్త్వదార్థ (పరమాత్మ) పరిశోధనలో - ఆ దేవుడి దేహాల్ని కూడా పరిహరించేయాలి.

గొప్పదైన చీకటినే అహంకారంనుంచి ఏర్పడి అయిదుగా విభజించబడిన భూతపంచకంతో కూడినదే విరాట్ అజాండం దాని ఆకారం. అది దృశ్యరూపంగాబట్టీ, అదే దేహంగా వుంది కాబట్టీ, 'సృష్టి' అనే అవస్థని కలిగి వుంది గనుకా - అది ఆత్మ కాదని తెలుసుకో.

బ్రహ్మాండమే స్థూలకాయం. సృష్టి అవస్థ. బ్రహ్మ అహంకృతాభిమాని - కాబట్టి యీ కూటం ఆత్మ కాదు ఇక సూక్ష్మ శరీరం గురించి విను —

— అయిదయిన మహా భూతాంశాలే దేహం. అంత రంగం విష్ణువు. మనసు చంద్రుడు. బుద్ధి బ్రహ్మ. చిత్తం నారాయణుడు. అహంకారం రుద్రుడు. ఈ అయిదు ఆ సూక్ష్మాంగానికి కరణాలు. దిక్కులు చెవులు గాలి చర్మం. సూర్యుడు కన్నులు. జలం (కరుణుడు) జిహ్వ. అశ్వినీ దేవతలు నాసిక - ఈ అయిదూ జ్ఞానేంద్రియాలు. నోరు అగ్ని, చేతులు ఇంద్రుడు, కాళ్ళు వామనుడు, మర్మాంగం ప్రజాపతి గుదం మృత్యువు - ఈ అయిదూ కర్మేంద్రియాలు. ప్రాణాపానోదానవ్యాస సమానాలు ప్రాణవాయువులు. తన్మాత్రలైదు. వెరసి ఇరవయ్యయిదంశాలు. అవన్నీ దృశ్యాలే. నువ్వు ద్రష్టవు. కాబట్టి అవేవీ నువ్వు కావు. అవి ఆత్మరూపం కాదు.

అహంకార త్రయంలోంచి ఆవిర్భవించిన ఇరవయ్యయి దంశాలు, ఇతరేతర సమస్తాంశాలూ కూడా దృశ్యాలూ - అచేతనాలే తప్ప, నువ్వు మాత్రం కాదు. లింగ శరీర కార్యాలు గాని, అవస్థలు గాని నువ్వు కావు. నువ్వు దేహా తీతుడవని మర్చిపోకు.

స్థితి, అవస్థ, సూక్ష్మ దేహం. అభిమాని, విష్ణువు, పరి పాలన, హిరణ్య గర్భం, సాత్త్వికాహంకృతి - ఇవేవీ కూడా నువ్వు కావు. ఇక, సృష్టి స్థితి సంహారాలనాచరించే బ్రహ్మ విష్ణు మహేశ్వరులనబడే వాళ్ళు నామరూపాలున్న

పురుషులు గదా! అలాటప్పుడు వారిలో ఒకయిడన విష్ణువు ఆత్మ యెలా అవుతాడు? స్థితికర్త - పరిపాలకుడూ అయిన వాడు వికారుడయిన పరమాత్మ కాలేడోయ్! అసలు తామసాహంకారంతో వర్తించే - మాయ కడుపులో దాగుంటారు త్రిమూర్తులు. కాబట్టి, వాళ్ళెవళ్ళూ కూడా "ఆత్మ" కాదు. తానేదో సృష్టికర్తనని బ్రహ్మకి స్వాభిమానం యెక్కువ. అభిమానవంతుణ్ణి ఆత్మ అనలేం గదా! ప్రళయాన్ని కల్పించే సంహారకర్త రుద్రుడు. "కర్త" కూడా ఆత్మ కాదుగదా! ఏతావాతా చెప్పేదేమిటంటే ఆ త్రిమూర్తులకు కూడా కర్తయై, పునః ఏ విధమైన మాయ కాని, గుణంకాని లేకండా వెలిగేదే పరమాత్మ! అంచేత ఈ దృశ్యాలన్నీ ప్రక్కకి నెట్టేసి, సర్వసాక్షివి నువ్వే అయి వుండు.

ఇక ఈ చెప్పబడిన మూడు రకాల శరీరాలకీ సాక్షిగా వసించేదే - పంచ మహా భూతాలకీ కూడా కారణభూతమైన మూల ప్రకృతి శరీరం. దాన్నే అనాహతం అనీ, పంచ బ్రహ్మమనీ అంటారు. అది చెబుతాను పట్టు. దీనికవస్థ సర్వ సాక్షిత్వం. అభిమాని ఈశ్వరుడు. శుద్ధి సాత్త్వికాహంకారమే జ్ఞానశక్తి. బ్రహ్మంణాతీతమైంది స్థానం. సర్వ - కర్తృత్వ, పాలకత్వ, సంహారకత్వ, నియంతృత్వ, భోక్తృత్వ, ఈశ్వరత్వాది ఆరు గుణాలతో కూడిన ఐశ్వర్య భోగం ఓంకారం. మాతృకలో పరివ్యాప్తమైన ఆత్మ - మహాత్మ ఇత్యాది తొమ్మిది సంజ్ఞలుంటాయి. పిండం, అండం, బ్రహ్మాండం అనే మూడింటికీ ఇది ద్రష్టు శరీరంగా

చెప్పబడుతోంది. వాచ్యార్థంగా చెప్పబడే ఈశ్వరరూపం, దృశ్యాలైన అండపిండ బ్రహ్మాండాదులను సాక్షీ - చిత్తు - పీఠంతో కూడిన జ్ఞానోపాధిచేత శుద్ధ బ్రహ్మం సూచించ బడుతుంది. అంతకన్నా పైదానినే ఈశ్వరుడియొక్క తుర్యాతీతం అని చెబుతారు. అది పంచదార కలిసిపోయిన నీళ్ళలా - అంటే - నీళ్ళల్లో పంచదార వేస్తే ఏ విధంగా ఆ పంచదార నీళ్ళలో అయిన్యమైపోతుందో ఆ విధంగా - శాశ్వతమూ, బంధరహితమూ, అశబలశమూ, సుస్థిరం, యదార్థపట్ల గుర్తింపూ, దొడ్డదీ, నిజమైన చిత్తు సంబంధిత గొప్ప సంతోషమే - నిష్కల్మషమైన బ్రహ్మమని - మహా వాక్యాలు నిర్దేశిస్తున్నాయి. అలా నిర్దేశించబడిన (ఆనందో బ్రహ్మ) మహానందానివే నువ్వు...

ఉపర్యుక్త విధంగా - గురువు - భగవత్ శరీర చతుష్టయం గురించీ - తద్రీత్యా ఆత్మతత్త్వం గురించీ చెప్పడంతో - అంతా విన్నప్పటికీ కూడా - ఇంకా తెమలని సందేహాలతో వున్న శిష్యుడు - గురువుగారి పాదాలని తాకి—

"అయ్యా! ప్రవర్తమానాలైన అయిదు [ప్రపంచ లక్షణాలనీ], జీవుడూ - దేవుడూ - ఏకీకృతమయ్యే విధానాన్నీ, అందుకు తగిన ఋజువుల్నీ, ఇంకా అనేకమైన తెలుసుకోదగ్గ రహస్య విషయాలనీ చెప్పారు. నా అనుమానాలన్నింటినీ తీర్చేశారు. కాని, చిన్నకోరిక... మీరు జ్ఞానం గురించి చెప్పారు... అదే విధంగా అజ్ఞానం గురించీ, కల్ప పంచనం గురించీ కూడా వివరించవలసిందిగా ప్రార్థిస్తు

న్నాను—" అని కోరడంతో - దయామయుడైన గురువిలా చెబుతున్నాడు—

"మంచి ప్రశ్నడిగావురా అబ్బాయ్!... చెబుతాను విను-పిండానికి రెండూ, బ్రహ్మాండానికి రెండూ ఈనాలుగూ గాక - ఆత్యంతిక ప్రళయమని ఒకటీ - మొత్తం అయిదు ప్రళయాలున్నాయి. ఈ అయిదింటినే పంచకల్పాలంటారు.

ఇంద్రియసమాహితాలైన - ఈ శరీరానికి - మెలకువ, నిద్ర - అనే రెండు దశలున్నాయికదా! అలా మెలకువ లోంచి నిద్రలోకి జారుకోవడమే మొదటికల్పం [ప్రళయం.] ఇది ప్రతిరోజూ జరిగేదే కాబట్టి, దీన్ని "దిన ప్రళయం" - లేదా - "దినకల్పం"అంటారు.

పై కల్పంలో-నిద్రపోయినవాడు మళ్ళా లేస్తాడు. కాని, అలా లేవకండా శాశ్వతంగా నిద్రలోనే వుండిపోవ డాన్నే మహా కల్పం అంటారు.

ఇక - కృత, త్రేత, ద్వాపర, కలి - అనే నాలుగు యుగాలు కలిసి - ఒక మహా యాగంగా చెప్పబడతాయి. ఇలాంటి మహా యుగాలొక వెయ్యి అయితే - బ్రహ్మకు ఒక పగలవుతుంది. మరో వెయ్యి మహాయుగాలు ఆయనకో రాత్రి - ఆ రాత్రి కాలాన్నే జలప్రళయం అంటారు. తిరిగి ఆయన నిద్ర లేవడం కూడా ప్రళయమే - ఇలా నాలుగు ప్రళయా (కల్పా)లయ్యాయి కదా! - ఇక కడసారిదైన బ్రహ్మకల్పం గురించి చెబుతాను విను... బ్రహ్మగారి ఆయుర్దాయం పూర్తయిపోవడమే బ్రహ్మకల్పం. ఆ సమ

యంలో - పన్నెండుగురు సూర్యులూ ప్రస్ఫుటమవుతారు. మొత్తం ప్రపంచాన్ని ఎండగట్టేస్తారు. ఆ తర్వాత - మేఘాలు కమ్ముతాయి. ఘోరున వర్షిస్తాయి. ఎండిపోయిన నేల మొత్తం - ఆ వానవల్ల నీళ్ళతో నిండిపోతుంది...

సర్వభూతాలూ ఆ నీళ్ళల్లో మునిగిపోతాయి. తదనుయాయిగా బ్రహ్మాండం లీనమైనప్పటికీ, రూపు మాయ కండా, సూక్ష్మంగ ప్రాయంగా - ఆ అజ్ఞానం బోధిలో నిక్షిప్తమవుతుంది. (అంటే నిద్రాగతమవుతుంది) ఇది బ్రహ్మకు రాత్రిగా తెలుసుకో.

ఆ విధంగా వెయ్యి మహా యుగాలు పూర్తి కాగానే - బ్రహ్మ, నిద్రలేచినవాడై - ఆ జలరాశుల్ని హరింపచేసి, అతఃపూర్వ జీవన వేళా కర్మవాసనానుసారంగా చాతుర్వర్ణాలకు చెందిన, సమస్త జీవరాశుల్నీ పునః సృష్టిస్తాడు. దీనినే దిన ప్రళయం అంటారు. ఇంతకన్నా పెద్దది మహా ప్రళయం.

ఆ సందర్భంగా - వంద సంవత్సరాలపాటు వర్షాలు పడవు. ఆ అనావృష్టి కారణంగా భూమ్మీది జీవకోటి యావత్తూ నశించిపోతుంది. అనంతరం పుషమిత్రాదులైన పన్నెండుగురు సూర్యులు యేక కాలంలో ఆకాశమార్గాన చరించి వందేళ్ళపాటు తమ దుర్భరమైన తమ వేడిమితో ఊర్ధ్వలోకాలేడింటినీ (భూమి, భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకం) కాల్చేస్తారు. ఆ మహా దహనవేళ, తగలడిపోయే లోకాల్నించి

చ్చటచచ్చటా రావాలో విశ్వవ్యాప్తంగా విరుచుకుపడే అగ్ని కణాలు ఆదిశేషుడి పడగల్ని సోకుతాయి. తట్టుకోలేని పాముల దొర - తన వెయ్యిపడగల్నీ విప్పార్చి విషం కుమ్మరిస్తాడు. అగ్నికి విషం తోడవడంతో - ఆ విషాగ్ని ధారాపాతానికి భూమి చిల్లులు పడిపోతుంది. ఆ కన్నాల గుండా విషపునిప్పురు పాతాళాన్ని చేరతాయి. ఆ దెబ్బకి అతలవితల సుతల తలాతల రసాతల మహాతల పాతాళాలనే దిగువలోకాలేదూ కూడా దగ్ధమైపోతాయి.

ఈ విధంగా ఏడేదు పద్నాలుగు లోకాలూ వూడ్చుకుపోయాక, సంవర్తకాది మేఘాలు దిక్కుల్నిండా క్రమ్ముకుంటాయి. వినేవాడంటూ యెవడైనా వుంటే వాడి చెవులు బ్రద్దలయ్యిపోయేలా ఉరుములూ గర్జనలూతో - చూడగలిగినవాడెవడైనా వుంటే కళ్ళు పేలిపోయేలాంటి మహాత్కాంతియుతాలైన మెరుపుల్తో - బ్రతకడానికి ఏ అవకాశమూ మిగల్చని గొప్ప గొప్ప పిడుగులతో-నూరు-నూరంటే నూరేళ్ళపాటు అరక్షణంలో అరవయ్యోవంతు సేపయినా తెరిపనేది యివ్వకండా, రాత్రింబవళ్ళనే తేడా లేకండా - నింగికీ నేలకీ నీళ్ళతో స్తంభాలు కట్టినట్లు - ఏక ధారగా కుంభవృష్టి కురుస్తాయి. అంతలో - అంతా నీళ్ళే తప్ప - ఆవగింజంత మరో పదార్థం వుండదు. అతఃపూర్వమే తగలడిపోయి బుగ్గపోయినదంతా ఆ నీళ్ళలో అంతర్లీనమై వుంటుంది.

అలా వందేళ్ళపాటు - వంట్లో నీరంతా దింపేసుకున్న మేఘాలు ఈ ప్రళయ జలాంతర్భాతాలుగా వుంటాయి.

తత్కారణంగా - ఆ ప్రళయ సాగరంలో బడబాగ్ని పుడు తుంది. అదా జలాన్ని ఎండగట్టేవేళ జరిగే నీటి కల్లోలం లోంచి గాలి పుడుతుంది. నిప్పుకు తోడై కూడా - దానిని కూడుకుని ఆకాశమంతా భయంకరమైన రొదతో సంచ రిస్తుంది వాయువు.

అక్కడ తన్మాత్రాయుతంగా, మహత్తయి - తామసం ఆవిర్భవిస్తుంది .. తామసం అహంకారంలో లీనమవుతుంది. దానిని రాజసాహంకారంలయం చేసుకుంటుంది. దానిని సాత్త్వికాహారం స్వాహా చేస్తుంది. ఆ రాజసాహంకారం జ్ఞాన కర్మేంద్రియ సహితమై సాత్త్వికాహంకారజడంలో లీనమైపోతూ టుంది. ఆ సాత్త్వికాహంకారం, అంతఃకరణ దేవతలు, మూలాధారాది చక్రాదిగత మహత్తత్వమైన అవ్యాకృతంలో కలుస్తాయి. అత్యంత దొడ్డదీ, విశేష మహాత్మ్యాపూర్వకమైనదీ అయిన ఆ అవాకృతం- మూల ప్రకృతి యైన మహా మాయతో సంగమిస్తుంది.

ఆ విధమైన సంలీనంలో, ఇరవయ్యయిదు భూత గ్రామాలూ, అన్నిరకాల జీవజలాలూ ఒదిగుండగా, పరమ పురుషుడు తానే పరబ్రహ్మంగా ప్రకాశించే అన్ని శబ్దాలూ గుణసామ్యంలో ఒదిగిపోతాయి తద్గుణసామ్యమైన మూల ప్రకృతి పరబ్రహ్మంలో విలీనమవడంతో - ఆ పరబ్రహ్మలో ఇచ్ఛాజ్ఞాన, క్రియాజ్ఞాన, ద్రవ్యజ్ఞాన రూపమైన మూడు శక్తులూ ముడుచుకుపోతాయి. ఎలాగో చెబుతాను.

అసలీ ప్రాణికోటీయుత ప్రపంచమంతా ఒక పంట పొలంతో పోల్చుకుంటే- ఇవి ఎందులోంచిపుట్టాయో, ఆ విత్తనాలన్నీ కూడా 'కర్మ' అనే బురదలో కూరుకుపోయుంటాయి. అలాంటి జీవయుక్తమైన 'కర్మ' అనే బురద - అజ్ఞాన భావంతో ఐక్యమైపోతుంది.

జ్ఞాన శూన్యులు కావడంవల్ల జీవులకి మోక్షం లేదు. అబ్బాయ్! అంత పెద్ద మర్రిచెట్టు - చిన్న విత్తనంలో వున్నట్టే, ప్రపంచం సమస్తం గుణసామ్యంలోనే ఒదిగి వుంటుంది. అయితే, ఆ గుణసామ్యమనేది అయోనిజ స్వాయంభువ స్వస్వరూపాంతర్గతం కావడంతో - అభాసాన్ని పొంది, పరబ్రహ్మమొక్కడే ప్రకాశమానుడవుతాడు. అదెలాగని సందేహం రావచ్చును. చెబుతాను విను.

పచ్చి కుండల్ని నీళ్ళలో ముంచితే- అవి చిలికిపోయి- వాటి మట్టి మొత్తం నీళ్ళలో కలిసిపోయినట్లుగానే, మొత్తం ప్రపంచం ఏ విధమైన వికారం లేకండా నిర్గుణంలో కలిసిపోతుంది. సరే, నాగేటి చాలులోంచి పంట పుట్టినట్లుగా, మళ్ళా ఈ లోకాలన్నీ యెలా పుడతాయనే విషయం ముందే చెప్పేశానుగదా! ఇప్పుడు అత్యంతిక ప్రళయాన్ని వివరిస్తాను—

దీనికి కర్త "వివేకి". వాడొక్కడే విశ్వాన్నంతట్నీ విలయంలో ముంచేస్తాడు. సాధారణంగా త్రాడుని చూసి త్రాచని భ్రమపడ్డం భయపడ ం జరుగుతూనేవుంటుందికదా! శాస్త్రాంత వివేకం (యదార్జ్ఞానం)తో పరిశీలిస్తే భ్రాంతి

నశించి, భయం తొలగిపోతుంది... లేదనుకో, అలా భయ పడుతూనే వుంటారు. అదే విధంగా - నీ స్వస్వరూపాన్ని నువ్వు తెలుసుకోగలగాలి.

ఉదాహరణకి - నీకో కలొచ్చింది. ఆ కలలో శతృవులు నిన్ను చుట్టుముట్టారు. వాళ్ళని చంపందే నీకు మనుగడ లేదనిపించింది. చటుక్కున మేల్కొన్నావ్ ! అప్పుడు నీ శత్రువు లేమయ్యారు? మాయమైపోయారు గదా! అలాగే ప్రపంచమంతా నిజంలా భాసిస్తూ సంహరింపబడుతుంది. సూర్యకిరణాలే విధంగా దూరంనించి ఎండమావుల్లా కనిపించి, చేరువకెళ్ళేసరికి ఏమీ లేకండా వుండేటట్లు - సజీవమైన బొమ్మయొక్క ఆకారం వున్నా లేనిదే అవుతుందో, మాయపరుచుకుని వుండడంవల్ల ప్రపంచంగా దృశ్యమానమవుతుంది. యధార్థానికీ ప్రపంచం మిథ్య తప్ప సత్యం కాదు. పరబ్రహ్మమే సత్యం. ఈ విధంగా తర్కించుకుని చూసినట్లయితే, ఈ లోకం చిలికి చిలికి నశించిపోయేదే తప్ప మిగిలేది కాదు. కాబట్టి - నశ్వరమైన ప్రపంచంలో తనకి సంసార బంధమనేది లేదు. ఇది నిత్య సత్య ప్రత్యక్ష ప్రళయంగనక — దీనినే అత్యంతిక ప్రళయం అని కూడా అంటారు.

అలాగని అది మహా ప్రళయంవలే వుండదుస్మా! అది స్థూల రూపం. పోలిక చెప్పాలంటే సంసారమే లింగ శరీరం. ఇదెప్పుడూ కూడా బీజ రూపంగా అజ్ఞానగర్భంలో కూరుకుపోయి వుంది. ఆ లింగదేహం పడిపోనంతకాలం జీవుడికి మంచో - చెడో కర్మలు చేయడం తప్పదు. ఆ కర్మ

తప్పనంతవరకూ, పాపపుణ్యాలూ - చావుపుట్టుకలూ తప్పవు. ఇవన్నీ బాగా ఆలోచించి అర్థంచేసుకో...

పంచ ప్రళయాలూ చెప్పాను. ఇంకొకటి ముక్తి కూడా చెబుతాను విను.

ఈ సత్త్వరజస్తమో గుణాల్ని ఆక్రమించుకుని వున్న అవ్యాకృతం ఈశ్వరుడి కారణదేహం. గొప్పదయిన నిద్రే దాని అవస్థ. రుద్రుడభిమాని. కాబట్టి ఇవన్నీ గుణభరితాలే కదా! మరి గుణాల గూళ్ళు - నిర్గుణమైన ఆత్మ యెలా అవుతాయి. గొప్పవాడయిన విరాట్టైనను-హిరణ్యగర్భుడను- అవ్యాకృతీ అను - సృష్టిస్థితి ప్రళయాదిక బ్రహ్మవిష్ణు మహేశ్వరులేనను - అంతా గుణ ప్రధానులేగాని - నిర్గుణ పరబ్రహ్మలుగాని, నువ్వుగాని, ఆత్మగానికారని తెలుసుకో.

—అయిదో పాఠం సమాప్తం—

# వివేక సింధువు

## ఆరో పాఠం

జిజ్ఞాసువులైన శిష్య శ్రేష్ఠుడా !

జీవుడికీ దేవుడికీ నడుమనుండే తదాత్మ్యైక్యాన్ని తెలియజేస్తాను విను

తత్పదార్థానికీ, త్వంపదార్థానికీ (దేవపదార్థానికీ - జీవపదార్థానికీ) - ఒకదానిపట్ల మరొకదానికున్న గురి - లేదా - దృష్టివల్లనే - పోలిక చెప్పడానికి వీల్లేని గొప్పదైన ఫలితం యేర్పడుతూంది.

ఆ దేవ పదార్థమే ప్రత్యక్పరబ్రహ్మగా మహావాక్యం నిర్దేశిస్తోంది. మాయవల్ల కలిగే అజ్ఞానం - అజ్ఞానంవల్ల మాయలో పడడం అనే రెండింటినీ తీసి అవతల పారేస్తే - అత్యంత గౌరవప్రదమైన చైత్యమనేది మిగుల్తుంది.

తత్ గా చెప్పబడే ప్రత్యేక్పరబ్రహ్మమే (దైవమే), త్వంపదార్థంగా చెప్పబడే నువ్వు (జీవాత్మ) అన్నదే మహా వాక్య నిర్దేశం.

విన్నాడు శిష్యుడు. మరింత వినీతుడయ్యాడు గురువు ముందు - మృదువుగా అడగసాగాడు—

— "అయ్యా !"

మంచు మంచ లేనట్లూ, మంటకి చల్లదనం లేనట్లూ - మంచూ మంటలంతవిభేదమున్న జీవుడూ దేవుడూ ఒక్క టెలా అవుతారు. అదే (తత్) 'నే' (త్వం) అని యెలా వూహించు కోగలం !.

సర్వే సర్వత్రా లోపలా బయటా కూడా విస్తరించి వున్నవాడు దేవుడు. ఈ తోలుతిత్తిలో ఒక పరిణామంలో వుండేది జీవుడు. సర్వం సహా యజమాని దేవుడు, సర్వదా ఆయన సేవకుడే జీవుడు. దేవుడు స్వతంత్రుడు. జీవుడు పరాధీనుడు. శాసించేవాడు దేవుడు. శాసించబడేవాడు జీవుడు. జనన మరణాది ఝంఝూటభూయిష్టమైన సంసార బంధనాలేవీ లేనివాడాయన. ముప్పొద్దులా ఈ సంసారంలో మునగానాం తేలానంగా వుండేదీయన. కర్మలు కాని, కర్తృత్వం కాని లేనివాడాయన. కలలోనైనా కర్మలనోదులు కోలేని లంపటుడీయన. అన్నిరకాల ఫలాలనీ ప్రసాదించేది తను. వాటిననుభవించేది నేను. ఈ సృష్టిస్థితిలయాదులన్నీ నిర్వహించేది తను. అనునిత్యం దుఃఖపడిపోతూ ఏడ్చేది ఈ నేను. మా ఇద్దరికీ మహైక్యం ఎలా కుదురుతుందో అర్థం గావడంలేదు శాస్త్ర వివరంగా చెప్పండి."

శిష్యుడి సందేహం విని - చిరుదరహాసంతో గురుడు చెప్పనారంభించాడు.

"శ్రద్ధగా వినరా అబ్బాయ్ ! కేవలం ఉపాధి బేధం వల్ల మాత్రమే జీవుడూ - దేవుడూ వేర్వేరుగా అనిపిస్తు న్నారు తప్ప, నిజానికేమీ తేడా లేదు.

ఒకే బంగారం వస్తువుని అద్దాలలో వాటిల్లో-రెండుగా చూస్తున్నట్లే ప్రకృతి తోటి పొందువల్లనే - బ్రహ్మన్ - జీవుడు, దేవుడు అని రెండుగా అనిపిస్తాడు. మాయోపాధి చైతన్యుడు పరమాత్మ. అజ్ఞానోపాధి చైతన్యుడు జీవాత్మ. ఇందాకా నువ్వు చెప్పిన సర్వవ్యాపకత్వ, ప్రసాద, ముక్త - సృష్ట్యాదికరణ గుణాలన్నీ మాయోపాధికి చెందినవి. తద్వారా దృష్టిని పరమార్థాన నిల్పి పరిశీలిస్తే, నిర్గుణ పరమేశ్వరుడొక్కడే యీ ఉభయంగా భాసిస్తున్నట్లుగా తెలుసుకోగలుగుతావు.

మాయా కల్పితమైన ఉపాధే దేవుడికెలా ధర్మ మయ్యిందో, అదే విధంగా అజ్ఞాన కల్పితమైన ఉపాధే జీవుడి ధర్మమై వుందయ్యా! పైన చెప్పిన పైడివస్తువు అద్దాలలో ద్వంద్వంగా తోచినట్లే - ఇక్కడీ అజ్ఞానోపాధే లేని దున్నట్లుగా కనపడటానికి కారణం అవుతోంది. ఈ కిటుకుని శాస్త్రంత రసహృదయంలో అవగాహన చేసుకోవాలిస్మా...

ఈ జీవుడికున్న ముప్పయ్యైదు మూలతత్త్వాలనీ వివేకంలో విమర్శించుకున్నట్లయితే - ఆ మొత్తం అంతరించి పోయి దానవతలున్న బ్రహ్మనొక్కడే మసుల్తాడు. అయితే అజ్ఞాన ధోరణిలో మాత్రం నిత్యత, మహా ప్రకృతి, శాశ్వ తత్త్వం అనే వాటియందు ప్రలోభాదులు అడ్డుకోలేనివని ముందే చెప్పాను కదా !-

ఒక్క విషయమోయ్! మాయాకల్పిత జీవుడైన దేవుడును - అజ్ఞానకల్పిత జీవుడైన జీవుడనూ - అసలు

9)

వీళ్ళిద్దర్నీ అవతలికి నెట్టేస్తేనే - అసలు బ్రహ్మన్ తగులుతాడు, మిగులుతాడు.

ఇంకొంచెం ముందుకెడదాం.

వేదాంతంలో "జహల్లక్షణ" మనొకటుంది. అది మళ్ళా - "జహదల్లహ" "జహదజహల్లక్షణ"మని రెండు రకాలు. మొత్తమ్మీద ఈ మూడింటికీ కలిపి లక్షణాత్రయం అని పేరు. ఇక "తత్" "త్వం" అనే పదాలకున్న వాక్యార్థాలన్నీ ఓ వారగా పడేసి, కశ్మలాల్ని కడిగేసుకుని లక్ష్యార్థాన్ని మాత్రమే తీసుకోవాలి...

ఏ విధంగానైతే ధాన్యం మీది పొట్టు, చిట్టు తొలగించి - మధ్యలోని - "గింజ"ని మాత్రమే గైకొంటామో - అదే రకంగా - "మాయ" అనూ, "అజ్ఞానం" అనూ .. ఈ రకాలయిన ఉపాధులన్నింటినీ పక్కకితోసి లక్ష్యార్థాన్నే గ్రహించాలి. అయితే - మహా వాక్యాలు వృధాపోవుగదా!- తస్మాత్ - "జహల్ల" "జహల్లద" అనేవి వదిలేసి- "జహల్లద జహల్లక్షణ"మనే దాన్నే ప్రమాణ గాతీసుకోవాలి. తక్కింది పనికిమాలిందానిగా గుర్తించి ప్రక్కకు త్రోసెయ్యాలి. ఒక ఉదాహరణ చెబుతా పట్టు -

ఒకడు పల్లకీని యెక్కుతాడు. కాస్సేపు గుర్రంమీదా తిరుగుతాడు. అయితే వాడు సవారీ చేసే పల్లకీ - గుర్రాలనేవి రెండు విభిన్న వస్తువులు కదా! అయినప్పటికీ కూడా- సవారీ చేస్తున్నవాడు మాత్రం ఒక్కడే. ఏక మాత్రుడే తప్ప ఇద్దరు కాదు. ఆ ఒక్కడే పల్లకీలో వుంటే కామందుగా,

గుర్రం తోకేప్పుడు రాతుగా భాసించినట్లే - మాయో పాధివల్ల దేవుడుగా, అవిద్యోపాధినల్ల జీవుడిగా చెప్పబడు తున్నప్పటికీ - ఆ పరబ్రహ్మన్ మాత్రమే ఒక్కడే.

అలాగే ఒకడొకసారి కాశీ వెళతాడు. ఇంకోసారి రామేశ్వరం వెళతాడు. స్థలాలూ - కాలాలూ తేడాతప్ప - ఆ కాశీ మనిషీ. ఈ రామేశ్వరం మనిషీ ఒక్కళ్ళే అయి నట్లే - దేవుడూ జీవుడూ కూడా - ఒకటే. వాళ్ళలో తేడా లేదు.

ఉపాధుల్లో తేడాయే తప్ప, జీవాత్మ పరమాత్మల్లో చీమతలకాయంత భేదంలేదు, మాయోపాధిత్వంవల్ల దేవుడు సర్వజ్ఞుడుగా వుండి, ఆ తర్వాత మాయను గెలిచినవాడై - తదతీతమైన నిర్నిమిత్త బ్రహ్మన్‌గా వుంటాడు. అజ్ఞానోపాధి వల్ల జీవుడు కర్మలంపటుడై క్రమక్రమంగా జ్ఞానియై సుఖ దుఃఖాలకి ఎడమై సుఖపడతాడు.

ఇంకోమాట - మనకి స్పష్టపడుతూన్న, లేదా ప్రత్య క్షంగా వున్న చైతన్యమే పరోక్షంగా వున్న చైతన్యం కూడాను. ఆ పరోక్ష చైతన్యమే - ఈ ప్రత్యక్ష చైతన్యం. ఇవి అవినాభావంగా ప్రవర్తిస్తూ సంపూర్ణ చైతన్యంగా భాసిస్తాయి. అయినప్పటికిన్నీ, అజ్ఞానోపాధి - మాయో పాధుల కారణంగా వుండే ఈ రెండింటినీ ఈసడించి పురోగ మించ గలిగితేనే - జీవేశ్వరైక్యం ఘటింపబడుతుంది. గొప్ప దైన తాదాత్మ్యం సిద్ధిస్తుంది. ఈ తాదాత్మైక్య ఘటనలో యదార్థానికి ఎవరి కర్తృత్వమూ వుండదని తెలుసుకో !

గతంలో నీకు మూడు ముక్కల్లో మహా వాక్యార్థాన్ని క్షుణ్ణంగా వివరించాను గుర్తుంది గదా! ఇక - ఈ నిర్గుణ పరబ్రహ్మం ఇలాటిది, అలాటిదీ అని వర్ణించడం ఎవరివల్లా కాదు. అన్ని ఆలోచనలూ, ఊహాలూ అక్కడితో ఆగిపోతాయి. పోనీ అలా వూహాలుడిగిపోయినప్పుడే బ్రహ్మన్ లభించాడందామా అంటే అది ఉత్తిమాట! మనసనే దినుసు కేపీ తట్టదు. అది మాటలకదదు. వేలం వెర్రిగా 'బ్రహ్మన్' 'బ్రహ్మన్' అనే వేదశాస్త్రాలు వెలవెలబోతాయి. వేదాంతాలకి నోరుపడిపోతుంది. సిద్ధాంతాలు చీకిపోతాయి. మనసుకంతా తెలిసినట్టే అనిపించీ ఏం తెలియకండా వుండిపోతుంది.

యదార్థానికి - గురుకృపా విశేషం పాత ఈ 'బ్రహ్మన్' స్వానుభవంలోకి రావాలే తప్ప - చెబితే విని అర్థం చేసుకునేది కాదు.

అయితే - సాధకుల నిమిత్తమై - మహా వాక్యాలు మనకొన్ని మార్గాలు సూచించాయి. అందులో ప్రధానమైందే "నేతి". న+ఇతి=(అంటే) ఇది కాదు-. అంటే... ఆత్మే ఏదీ అని తర్కించుకుంటూ, 'ఇది కాదిదికా'దనుకోగా అనుకోగా బ్రహ్మన్ తోస్తుంది. అది మనసు గ్రహిస్తుంది. గ్రహించే మనసుకూ — గ్రహించగలిగే దాని తెలివికీ ఏది చైతన్యమై పుంటు దో వెలుగయివుంటుందో, ఆ వెలుగే బ్రహ్మన్-.

అదా - ఇదా - అనేది సమస్య అదీ ఇదీ కాదను కున్నప్పుడు 'మరేది' అనేది ప్రశ్న అలాగే - పిండం, బ్రహ్మాండం అనేవి రెండూ వట్టివేనని గట్టిగా నమ్మగలిగితే- జ్ఞానాజ్ఞానాలు రెండూ సమసిపోయి 'బ్రహ్మన్' స్వయంగా తోస్తుంది.

చేరువలోనే ఓ వస్తువుంది. కాని చుట్టూ చీకటిగా వుండడంవల్ల ఆ వస్తువు కనపడదు. అప్పుడో దీపం పట్టుకెళితే ఆ సరుకు స్పష్టంగా చూస్తాం. కదా- ఇక్కడే వుంది మెలికె- ఏ పదార్థాన్ని చూడ్డానికి మనం దీపాన్నట్టుకెళ్ళామో - ఆ దీపం, ఆ పదార్థాన్ని చూడలేదు. అలాగని, దీపం లేకపోతే మనం చూడలేం.

మళ్ళా ఇక్కడో తర్కం వుంటుంది - చూసే వస్తువు తెలిసినదే కావచ్చును. అప్పుడు దీపంతో పనేమిటని! వుంది. సరుకు నువ్వెరిగిందే! ఏం లాభం - అదప్పుడు నీక్కన పళ్ళేదుగా! ఎందువల్ల! చీకటివల్ల! అంచేత వస్తువు నీకు తెలిసిందే అయినా తత్కాలానికి దాన్ని కనుగోవాలంటే చీకటి అడ్డం కాబట్టి, ఆ చీకటిని తప్పించే దీపం సర్వవిధాలా అవసరం.

అదేవిధంగా అజ్ఞానం తొలగడానికి జ్ఞానదీపంకావాలి. మన మనస్సులో ఆ జ్ఞాన జ్యోతి వెలగనంతకాలం - నిజ (ఆత్మ) స్వరూపాన్ని తెలుసుకోడం సాధ్యంకాదు. జ్ఞానంతో అజ్ఞానాన్ని నశింపచేసుకోవాలి. సామరత్వమనే పచ్చి చీకటిని నశింపచేసుకోవాలన్నా, పుచ్చపువ్వులాటి 'ఎరుక' వెలుగులు వ్వతిల్లాలన్నా గురుబోధ అత్యంత ప్రధానం.

ఈ మాదిరిగా చెప్పబడిన మహా వాక్యానికి యితర మైనవే పాషండాది మతాల ప్రమాణాలు. నిత్యం మహా వాక్య శ్రవణంవల్ల - అంటే - గురుబోధలు వినడంవల్ల' జ్ఞానమనే నిప్పుపుట్టి, ఈ బంధాలన్నిటికీ అసలు కారణమైన 'తెలివితక్కువతనం' అనే కట్టెని కాల్చిపారేస్తుంది. ప్రపంచం యెంత పలచటిదో చెబుతుంది. ఈ లౌకికాలన్నింటినీ మన చేత తిరస్కరింపచేస్తుంది. పరబ్రహ్మన్ సాక్షాత్కారంకోసం ప్రాకులాడే మనల్ని ఆ సాధనలో కృతకృత్యులమయ్యేలా చేస్తుంది. ఎనలేని బ్రహ్మసుఖాన్ని కలిగిస్తుంది. అసలు-మహా వాక్య మహాత్మ్యనికో ఋజువిస్తాను - చూడు-.

శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై దండ కారణ్యంలో వనవాసం చేస్తుండగా, ఆ చుట్టుపక్కల ఋషులు, మునులు, తాపసులూ - అందరూ ఆయన దర్శ నార్థం సకుటుంబీకులై బయల్దేరారు. మగాళ్ళంతా రాముడి చుట్టూ కూర్చున్నారు. ఆడాళ్ళంతా సీతమ్మ దగ్గరికి చేరారు. "ఏవమ్మా! ఆ జనం మధ్యన చూడ్డానికే లేకపోతున్నాం. మీ ఆయన్ని చూపించవమ్మా కాస్త...ఆ పిల్లిగడ్డమాయనేనా?" అనడిగారు.

"ఆయన కాదు" అంది సీత...

"ఈ బవిరిగెడ్డ మాయనా?" మరో ప్రశ్న.

"ఈయనా కాదు" అంది సీత.

"పోనీ ఆ ఎంచక్కటి కొప్పు చుట్టుకున్నాయనేమో!" ఇంకో వనిత సందేహం.

"అబ్బే ! ఆయనా కాదు" సీతమ్మ సమాధానం.

"ఆ మాట్లాడే ఆయనా ?"

"కాదు"

"ఆ గుంపులోంచి మన మధ్యకే చూస్తున్నాడు చూడు — అతనా ?"

"కాదు లేవమ్మా !"

ఇలాగ - "నేతి-నేతి" క్రమంలో - ఈయనా కాదు, ఆయనా కాదు అంటూ చివరికి - "ఆయనే మా ఆయన" అని చూపించింది సీత !

అలా సీత చూపించిన రాముణ్ణి చూడగానే - ఈ మునికాంతలకి మాటలుడిగిపోయాయి. మనసులాపుంసా మోహనుడియందే లగ్నమైపోయాయి. సర్వవృత్తులూ వుడిగిపోయాయి. అమందానందకందళిత హృదయారవింద లై పోయారు.

అదిగో - ఆ విధంగా — "నేతి నేతి" అని తర్కించుకుంటూ - ఐహిక విషయాదులన్నింటినీ నిరసిస్తూ సాగి - తుదకి - బ్రహ్మానంద సౌఖ్యానుగతమై - తటస్థమై, కేవల స్వస్వరూపంతో సకల ప్రపంచాన్నీ వెలిగింపచేస్తూ, శ్రుతి వాక్యాలైన 'నేతి నేతి' వాక్యానికి కూడా అనంతమై - [అంటే - ఇది కాదిది కాదని చెప్పడమే తప్ప 'ఇదే'నని వేదాలు కూడా స్పష్టపరచలేకపోయేటంత గొప్పదై], మనసుకే అందరానంత మహిమాన్వితమైనదే పరబ్రహ్మం.

యదార్థానికి ఆ బ్రహ్మన్ గురించి వేదాలు చెప్ప కండానే చెప్పాయి. తద్వారా మహాత్ములా బ్రహ్మన్‌ని - తెలియజెప్పలేనంతగా తెలుసుకోగలిగారు. ఆ 'పరబ్రహ్మన్'ని ఎలా చెప్పాలో వేదాలకే తెలియదు. అందువల్లనే - వేటి వేటిని మనం బ్రహ్మన్‌గా పొరబడతామో - వాటి వాటిని "బ్రహ్మన్ కా"దని చెప్పుకున్నాయి.

అటువంటి ఆ బ్రహ్మ పదార్థం నువ్వేనన్నది స్వానుభవంలో తెల్సుకోవాలి. అయితే అది వేదపారాయణాలవల్లా, శాస్త్రాభ్యాసాలవల్లా, పూరికే పుస్తకాలు చదివైడంవల్లా పట్టదు. కేవలం గురుముఖతః మాత్రమే సాధ్యమనేది - అనాదిగా వస్తున్న అక్షరసత్యం.

ఇలాగన్నామని... ఒకళ్ళని చూసోకళ్ళు - వేలాదిగా - గురువుల్నాశ్రయిస్తారు. ఉపదేశాలు పొందుతారు. కాని జ్ఞాన ప్రాప్తి లేకపోవడంవల్ల - ఆ బోధ వాళ్ళ మనసులలో నిలబడదు.

అంచేతేమిటంటే - రాగద్వేషాలు చచ్చి, ప్రపంచం మీద ఈసడింపు పుట్టి, వైరాగ్యం వంటబట్టి, పరమార్థమే గమ్యంగా ప్రయత్నానికుపక్రమిస్తే తప్ప - పరతత్త్వమైన శుద్ధ స్వస్వరూప దర్శనా వైభవం కలగదు.

అలా కాకుండా మూర్ఖత్వంతోనో, అజ్ఞానంతోనో, వుంటారు కొందరు. వీళ్ళింకా అన్న వస్త్రాలమీద ఆశ చావకండానే, ఆలుబిడ్డలమీద ఆశ తీరకండానే - ఏదో గురువుగారు చెప్పే నాలుగు ముక్కలూ చెవినేసుకుంటే రాజర్షులమయిపోతామని చెక్కడి పోతుంటారు.

వెనకటికెవడో విస్సన్న, కస్సెన్నని పిలిచి - "ఏదైనా గొప్ప అబద్ధం చెప్పరా" అంటే, "అసల్నే పుట్టి బుద్దెరిగి అబద్ధమే చెప్పలే"దన్నాట్ట కస్సెన్న...

అలాగ - గురుబోధలు సురుబోధలే, మన బాధలు మన బాధలే - అనుకుంటూరు కొందరు.

ఇంకొందరు గురువు చెప్పింది పాటిస్తారుగాని - అది కొంచెం విపరీతంగా వుంటుంది. అబద్ధం ఆడకూడదు-అంటే-నిజం చెప్పడం మానేస్తారు.

మరికొందరు మరీ వైపరీత్యం - గురువాజ్ఞ ప్రకారం నేనబద్ధం చెప్పనుగాని, నువ్విలా అబద్ధవాడై" అని అవతలి వాళ్ళచేత బొంకిస్తూంటూరు.

ఇలా— రంకొదిలితే బొంకు, బొంకొదిలితే గొంకూ ఏ రోజు కొత్త పాపంతో లంకెట్టుకుంటూరే గాని శుద్ధులు కాలేరు.

అంచేత చెప్పేదేమిటంటే - గురుబోధవల్ల అజ్ఞానం అంటుకుపోయి, సుజ్ఞానం పంటకొస్తుందీ అంటే - అది మనం విన్నంత మాత్రంచేతనే జరగదు. వినాలి, శ్రద్ధ వహించాలి. చింతనో - మననమో చేయాలి. విపరీతార్థాలు తియ్యకూడదు. సాధనలో పెట్టాలి... అంటే - "గురువాక్యం" అంటే "గురుశుశ్రూష, గురుసేవ" అని తెలుసుకోవాలి.

బ్రహ్మ సాక్షాత్కారానికి 'గురువే' ఆధారం కాబట్టీ,

తన్మాత్రలమైన ప్రపంచ నిరసనకి కూడా ఆయనే ప్రధానుడు కాబట్టి - గురువే 'బ్రహ్మణ్'గా భావించు - సేవించు.

"అహం బ్రహ్మన్" (నేనే బ్రహ్మాసి) అనీ - "సర్వాం బ్రహ్మం" (అంతా బ్రహ్మమే) అనీ - "బ్రహ్మాస్మి" - (నేనే బ్రహ్మనై యున్నాను) అనీ యోగులు చెబుతుంటారు. అంటే అర్థం "అది" "ను"వ్వనే కదా!

శ్రుతిద్వయం కూడా ఈ "అహం బ్రహ్మణ్"ని సమర్థిస్తూనే వుంది. అందువల్లనే దీనిని కాదనడానికి వీలులేని 'మహార్థ నిదర్శనం'గా చెబుతారు. ఆ స్థితి గొప్పదైన సమాధి కారణమవడంవలన - ఎందరో వేద వేదాంత సిద్ధాంతులు కూడా, చేతులెత్తి మరీ దీన్ని "సమ్యక్ జ్ఞానస్థితి"గా చెబుతున్నారు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ నిత్యముక్తులే. గొప్పవైన సద్సత్కార్యాలపట్ల ఆలోచనలున్నవాళ్ళే. విశుద్ధమైన సత్ జ్ఞానమే ఆకారంగాగల పరమాత్మపట్ల బ్రహ్మవబోధులే! ప్రత్యేకించి ఉపదేశమేమిటంటే — కనపడదగుగాని ఆ పరమేశ్వరుడే ఆదిగురువు - నిత్యముక్తుడు - అంచేతనే ఈ త్రిమూర్తులు ఆ పరబ్రహ్మకి అంతఃకరణ సంజ్ఞలుగా వర్తించుతూ - తమని తాము తెలుసుకున్నవాళ్ళై, బ్రహ్మజ్ఞాన వ్యసనులై వుంటారు. అంతేకాదు తమయొక్క మాయో పాధీ తాదాత్మ్యమైన తమ తమ నిజ (దైవీయ - లేదా - పరమేశ్వరాంతఃకరణా సంజ్ఞత్వాలైన) స్వరూపాన్ని విస్మరించలేదు గనక నిత్యముక్తులే అవుతున్నారు.

గురు అనుగ్రహమే కలిగి, జ్ఞానంయేర్పడి పవిత్రుడైన జీవుడు - దుఃఖసంభరితమైన జీవితం నుంచి జీవన్ముక్తుడవుతాడు. సనకసనందనాదులు నిత్యముక్తులు. తమ తమ పుణ్య కర్మలవల్ల భూమినిపడ్డ సత్పురుషులు సద్గురు బోధామృత పానంచేతనే ముక్తులవుతారు.

ఏ ప్రారబ్ధం కాలిపోయి ఈ మట్టిగడ్డమీద పుట్టాల్సొచ్చినా, సత్కర్మాచరణా స్పృహ వున్నవాళ్ళు- మానవ జన్మలనే యెత్తి, తమ తమ పుణ్యఫలంవల్ల గురువుగారి దయని సంపాదించుకుని, మళ్ళీ మళ్ళీ పుట్టడం చావడం అనే పుట్టలోంచి బయటపడి, ఆ జన్మలోనే - ఆ శరీరంతోనే జ్ఞానులై - జీవన్ముక్తులై - సత్ చిత్ పరబ్రహ్మాలుగా అవుతారు.

అడవిలో పుట్టిన చిన్న నిప్పురవ్వ - గడ్డిపరక మొదలు, పెద్దపెద్ద చెట్లని, లతల్ని, పొదల్ని ఎలా దహించేస్తుందో - అదే విధంగా - జీవుడికి చెందిన స్థూల సూక్ష్మ కారణ శరీరాల కర్మలవల్ల యేర్పడ్డ ప్రారబ్ధ జీవనం మొత్తమూ కూడా జ్ఞానాగ్నిలో కాలి బూడిదైపోతుంది.

ఎవరైతే - జ్ఞానంతో తమ మూడు శరీరాల్నీ తగలేసుకున్నారో వాళ్ళు - తరుగులేని ఆత్మానందాన్ననుభవిస్తూ - ఈ ప్రపంచంలో కాలిపోయిన గుడ్డలా సంచరిస్తుంటారు.

దగ్ధపటలం - మనకి కనబడుతూనే వున్నా, పట్టుకోవడానికి సాధ్యంకానట్లు ఆ జ్ఞానమూర్తులు - అకృతులవల్ల, అజ్ఞానులకు తమవంటివారిగానే కనిపిస్తుంటారు.

యదార్థంగా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందిన మహా యోగులకి వాళ్ళ ప్రారబ్ధ శరీరాలు మూడింటియొక్క స్పృహ వుండనే వుండదు. వాటి కర్మలూ వుండవు... సర్వ కర్మలకీ మొదటి మెట్టయిన సంకల్పాలూ వుండవు. ఆయా ఇంద్రియాలాయా పనులు చేసుకోపోడమేతప్ప చేసే పనులూ వుండవు. ఎలాగంటావేమో !

కాల్చబడిన విత్తనాలు తింటే కడుపు నిండదు. అయితేనేం - అది పాత్తే మొలకెత్తడానికేమీ అభ్యంతరం వుండదు.అందువల్ల గురుకృపాపాత్రులైనవాళ్ళు బాహ్యంగా ఇంద్రియ క్రియాశీలురుగావున్నా, అంతరంగాల్లో, అనవరతం గురుబోధామార్గంలోనే మసలుతుంటారు కాబట్టి, వాళ్ళకీ భవబంధాల భ్రమలు అంటుకోవు."

వెంటనే అడిగాడు శిష్యుడు—

"అయితే గురుదేవా ! అన్నిటికీ కారణం అజ్ఞానమనే గదా మీరు చెప్పడం, అలాంటి జ్ఞానం నాలో నశించి పోయిందని ఇతఃపూర్వపు బోధలలో చెప్పావు. అలాం టప్పుడు స్థూల సూక్ష్మ శరీర స్పృహ ఎందుకు పోలేదు నాకు? 'కారణం' లేకపోతే 'కార్యం' ఎందుకు వదలడం లేదు నన్ను ! అగ్నిబడ్డ బట్టు బుగ్గయి గాల్లో కల్సిపోవాలి కదా ! కాని ఇదింకా ఎలా నిలబడుంది ?"

శిష్యుడు ప్రశ్నకి చాలా సంతోషించాడా గురువు... జవాబివ్వడం మొదలెట్టాడు—

"సేబాసురా శిష్యా! బుద్ధిమంతులడగాల్సిన ప్రశ్నే అడిగావు. ఒక విలుకాడు బాణం వేశాడనుకో. వాడి బలాన్ని బట్టే దాని వేగం వుంటుంది గదా! ఆ వేగం వున్నంత వరకూ అది రివ్వున దూసుకుపోతుంది. వేగం అయిపోగానే నేలని పడిపోతుంది. అలాగే - మన ప్రారబ్ధ కర్మ సుడుంది చూశావ్! ఇదున్నంతవరకూ - ఈ దేహం ఇలావుంటూనే వుంటుంది. ఆ ప్రారబ్ధాం తాలూకు వడి తగ్గగానే, ఆ బాణం లాగే - ఇది కూడా తూలిపోతుంది.

కుమ్మరివాడు బలంగా త్రిప్పి వదిలిన సారె - కొంత వేగంతో తిరిగి తర్వాత వాలిపోతుంది. అలాగే మన ప్రారబ్ధం, కర్మ అనే వాటి బలానుసారంగా దేహ సంచారం! ప్రకటించబడిన అహంకారం, వికటుడైన కుమ్మరి, కర్మ అనే మట్టీ లేకపోతే - మన ఈ శరీరమనే సారె మాత్రం ఎంత సేపు తిరుగుతుంది? అందువల్ల - ప్రారబ్ధాన్నిబట్టి - స్థూల సూక్ష్మ శరీరగామియై వుండీ కూడా - జ్ఞానియైనవాడు - దేహాన్ని దహించుకుంటాడు.

దీన్నే 'నిర్గుణ సాయుజ్యముక్తి' అంటారు. ఇత్తెలుసు కున్న వాళ్ళకి మళ్ళీ పుట్టడం గిట్టడంవంటివేవీ వుండవు.

—ఆరో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## ఆబున్నొకటో పాఠం

శ్రీమంతమైన యీ వివేకసింధువనే వేదాంతకథా సుధానదీ తరంగాలలో లీనమైన బుద్ధిమంతులకు క్షేమాన్ని కలిగించేటువంటి నీలాల మాలికాలంకృతమై మంగళ ప్రదంగా తోచే మూర్తియైన శ్రీ దత్తమూర్తీ! తదుపరి కథనాలకించు.

అన్ని శాస్త్రాల అర్థాలనీ, అన్ని రకాల తత్త్వాలనీ తెలిసిన గురువు - తన పాదపద్మాలమీద భక్తి ప్రపత్తులతో అలరారే శిష్యుడిపట్ల ఆదరభావంతో ఇలా బోధిస్తున్నాడు.

ముక్తిలో కూడా కొన్ని రకాలున్నాయి.

1. సాలోక్యం :- ఆరాధించిన దైవతం వుండేలోకంలో వుండడం.

2. సామీప్యం :- ఆరాధిత దైవతానికి చెప్పుకోదగ్గ చేరువలో వుండడం.

3. సారూప్యం :- ఆరాధిత దైవతంయొక్క వేషాన్ని పొంది వుండడం.

ఈ కిరణాల ముక్తి పొందిన భక్తులకి ఆకాశగమనం తప్పదు. ఇక నాలుగోదింకొకటుంది. అది సాయుజ్యం. అంటే

ఆరాధించిన దైవత లోకంలో, ఆ దైవతానికి చేరువగా, ఆ దైవతం యొక్క వేషంలో, "ఆయనే ఈయనా ?" అన్నట్లుండే స్థితిని పొందడం. అయితే. ఇది భావకల్పితంగా చెప్పబడింది.

ఏది ఏమైనా - దానివల్ల కూడా బంధనం తప్పదు. అది కూడా పునర్జన్మ ప్రదమే! ఇందుకో దృష్టాంతం చెబుతాను.

పూర్వం జయవిజయులనే వాళ్ళు గొప్ప విష్ణు భక్తులుండే వాళ్ళు. వాళ్ళు తమ భక్తి తాత్పర్యాలతో - వైకుంఠం చేరి, విష్ణు సాయుజ్యాన్ని పొందారు. చూసే వాళ్ళందరికీ వీళ్ళు రెండో విష్ణువేమోనన్నట్లుగా వుండేది. అయినప్పటికీ అక్కడ వీళ్ళపని విష్ణు ద్వారానికి కాపలా కాయడం. చెప్పానుగా బంధనం తప్పదని! అటువంటి ఈ జయవిజయాలు ఒక సందర్భంగా బ్రహ్మజ్ఞానుల శాపాన పడ్డారు. అంతటితో వాళ్ళ శక్తులూ గట్రా అన్నీ కోల్పోయారు. వైకుంఠాన్నొదిలిపెట్టి, ఈ మట్టిగడ్డమీద మాంసవాశనులై పుట్టారు. అయితేనేం మహా సామ్రాజ్యాలని పాలించారు. అంచేత - యీ సాయుజ్యం కూడా పునర్జన్మకరమేగాని మరోటి కాదు...

చెప్పొచ్చిందేమిటంటే... ఈ విష్ణు సాక్షాత్కారాలూ, వేరే దైవతా సాక్షాత్కారాలూ విశేషం కాదు. అదంతా మాయోపాధి కల్పనేనని తెల్సుకో. నిజస్వరూప (ఆత్మ) సాక్షాత్కారం కలగనంతవరకూ నిర్గుణ సాయుజ్యం కలగదనడం నూటికి నూరుపాళ్ళూ నిజం.

ప్రళయకాలంలో లోకాలన్నీ నశించిపోతాయి. అప్పుడవన్నీ ముక్తి పొందవు గదా! దిన ప్రళయంలో మళ్ళా అలనాటి కర్మ పరిపాకాల్తోనే పుట్టిచస్తాయికదా! కాబట్టి అదేదీ ముక్తి కాదు... జ్ఞానియై - నిర్గుణ సాయుజ్యం పొందడమే యదార్థమైన ముక్తి.

ఈ యదార్థమైన మోక్షాన్నాశించే - ఆదికాలం నించీ పురూరవుడో మొదలయిన ఎందరెందరో చక్రవర్తులు కూడా తమ సిరిసంపదల్ని కోసి, ఆశల్ని కోసి, సర్వసంగాల్నీ బాసి, తన్నిమిత్తమే తపస్సుచేసి, చిట్టచివరికి సాధించారు.

సముద్రంలోంచి కెఱటాలు వువ్వెత్తున లేచి - మళ్ళా ఆ సముద్రంలోకే జారుకుంటాయి - అలా ఎవరైతే ఆత్మ సాక్షాత్కృతిని పొందుతారో వాళ్ళే సత్యమోక్షాన్ని చెందుతారు. వాళ్ళు శరీరధారులుగా వున్నప్పుడు జీవన్ముక్తులనబడతారు. ఎప్పుడయితే ఈ శరీరాదులన్నింటినీ కూడా అధిగమించేస్తారో అప్పుడు వాళ్ళనెవ్వళ్ళూ వర్ణించలేరు. ఏ మాటా వాళ్ళని పోల్చలేదు. ఏ పేరూ వాళ్ళని పిలవలేదు...

ఇప్పుడింకో సందేహం వస్తుంది. మోక్షం అనేది నిజమైతే, బంధనం కూడా నిజమే కావాలిగదా అని... దాన్నెలా పరిహరించాలో కూడా చెబుతాను విను.

బంధనమనేదెప్పుడూ సత్యం కాదు. మోక్షమే సత్యం. బంధానికి మూలం అజ్ఞానం. మోక్షానికి మూలం జ్ఞానం.

జ్ఞానానికి ఆనందమే ఆకారం. ఈ ఆనందం క్రియా త్మకంగా చెప్పబడుతోంది. అయితే ఆనందపరంగా చెప్ప బడిన పరమాత్మకం - క్రమక్రమాలని రెండు. అవే నివృత్తి ప్రవృత్తులు. మనోబుద్ధి వాసనలచేత ఆయా ధోరణులలో ఇంద్రియాలూ ఆత్మ ప్రవర్తిస్తాయి. అటువంటి చిదానంద మయమైన నిరాకారంలో ఒకడు నిద్రిస్తే మరొకడొచ్చి లేపడం అనేది వుండదు. నిద్రించినవాడు తనకు తనే లేస్తాడు.

అది సత్త్వదంగా చెప్పబడుతుంది. ఆ నిద్రలో స్వయంగా మేల్కొనవాణ్ణి సత్త్వోదంటారు. నిద్రలోనే మునిగివుంటే చిత్పదానందుడవుతాడు.

ఒకడు నిద్రపోతాడు. కాని ఆ తమ తీరకుండానే లేస్తాడు. లేచినవాడు సూర్యుడు ఉదయించాడు గనక, ఆ దిక్కు ఉత్తరం దిక్కంటాడు. మరొకడొచ్చి - "అది ఉత్తరం కాదురా నాయనా తూర్పు" అని చెప్పినాసరే మొదటివాడు వినడు. అనంతరం నిద్ర మత్తొదిలి-తర్వాత - దిక్కుల్నీ, ధర్మాల్నీ లెక్కగట్టుకుని - సూర్యుడు తూర్పునే ఉదయిం చాడు - అనుకుంటాడు.

అదే విధంగా మాయాబంధం వలన నిద్రాగతుడైన జీవుడు తనకు తానేగా లేచినప్పుడు—ఈ అవయవాలకిగాని, ప్రపంచానికిగాని అతీతమైన ఆనంద స్వాంతంతో - తన స్వస్వరూపాన్ని స్వభావగతంగా తెల్సుకుంటాడు.

ప్రత్యేకించి మాయని గురించి కొంగొట్టేసు కూర్చో

నక్కర్లేదు... ఎందుకంటే - నిద్రలాగే అదికూడా నిత్యం కాదు - కాస్సేపు నిద్రపోతే మెలకువ వొచ్చేసినట్లే - అది కాసేపుండి చెల్లిపోతుంది. మాయ కమ్మేసింది, మాయలో వున్నానూ అనే గాభరా తగ్గించుకుని ఆలోచిస్తే-ఆ మాయ చేసే మాయేమిటో ఇట్టే తెలిసిపోతుంది.

ఇకపోతే - మన కేకోశానా సంబంధం లేని అజ్ఞానం ఒకటి తారసపడుతుంది. వరిచేలో కలుపు మొక్కలాగా ఈ అజ్ఞానం అవశ్యం తొలగించుకోవలసిందే ... ఎన్ని రకాల కృషి చేసయినా సరే-ఆత్మజ్ఞానంతో ఆ అజ్ఞానాన్నంతరింపచేసుకోవాలి.

ఇలా త్రాడుచూసి పామనుకొని జడుసుకుని - పరిశీలనానంతరం దానిని త్రాడుగా తెల్సుకుని జడుపు మాని నట్లే—ఎఱిగినంతవరకూ ప్రకృత్యనుష్ఠానం నిర్వహిస్తూ పద త్రయ జ్ఞానార్జనలో లీనమైనప్పుడు అజ్ఞానమనే ప్రకృతి అణగారిపోయి - శుద్ధానందం ఒక్కటే క్రీడిస్తుంది. అలా ఆనందమయి అయిపోయి వుండే — ఈ ప్రకృత్యభిమానులకి తత్కారణాలైన మంచిగుణాలవల్ల అభివృద్ధి పొందే ప్రకృత్యానందం అతి చేరువలోనే అలరారుతూంటుంది. ఆ ప్రకృతి అత్యధికమైన శక్తిలో భావం, అభావం అనే రూపాలలో మసల్తూ ఆనందాన్నే తన స్వభావంగా కలిగి వుంటుంది.

ఇప్పుణ్ణేకీ రెండు పదాల గురించీ యేమీ తక్కువ కాకండా చెప్పేశాను. తత్పదమయంలోగాని, చిత్పదమయంలోగాని ద్వయం - అద్వయం - అనేవి రెండున్నాయని

కొందరు వ్యాఖ్యానిస్తారేగాని – వాటి వివరాల్ని చెప్పడం నూటికో కోటికో ఒకడికూ్కడా సాధ్యంకావు.

నిజం చెప్పాలంటే "పదార్థమే" నిత్యమని తెల్సుకో మనాలి నేను కాని, అలా అనకూడదు కూడా! ఎందుకంటే, ఎన్ని మంచి పదార్థాల్లోనైనాసరే, ఒక్క చెడు పదార్థం వుంటే చాలు ఆ మొత్తం సత్పదార్థాలన్నింటినీ కూడా వది లేసుకోవాలి.

సరే, ఇంతవరకూ చెప్పిన ఈ 'సత్' - 'చిత్' అనే రెండు పదాల గురించీ చింతన చేయడంవల్ల- ఆత్మ - ఆయా పదాలనందుతూంటుంది. ఈ విధమైన సత్పదం, చిత్పదం ఆనంద పదం - అనే మూడింటి గురించీ వరుస క్రమంలో వున్న సనాతన ధర్మాలన్నీ చెప్పాను.

ఈ సచ్చిదానంద పదాలనే మూడింటినీ పరీక్షించి చూడగలిగితే, భిన్నత్వం-అభిన్నత్వం-అనే రెండు భావాలు నీకు కనిపిస్తాయి. మొత్తంమీద "ఆనందో బ్రహ్మ" అనే మహా వాక్యానికి వివరణ. ఇంకో కొన్ని రహస్యాల్ని చెబుతాను విను. తద్వారా కూడా నీ యదార్థ ఆత్మ స్వరూపాన్ని నువ్వు తెల్సుకోగలుగుతావు.

ముందుగా 'సత్'కి మూడు బేధాలు చెబుతారు. 1) సత్ 2) అసత్ 3) సదసత్ -వీళ్ళు చెప్పే ఈ మూడూ కూడా కల్పితాలే తప్ప "సత్" మాత్రం కావు.

సత్యమనేదెప్పుడూ నిరాకారంగా వుండాలి కాని సాకారంగా వుండదు. ఏది సాకారమో దాని ఆకారం

ఇవాళ కాకపోతే రేపయినా చెడిపోతోంది. ఆ విధంగా తొలగిపోయేది సత్యమెలా అవుతుంది?

అలా కాదయ్యా! సత్యాంశంటే వేరేగానో - లేదా నశించి పోయేదిగానో వుంటుందని వాదించొచ్చు. అది పిల్లల సుద్దకొక్కటే చూస్తేతప్ప-సత్యం మాత్రం కాదు.

ఎందుకంటే - నిజంకన్నా వేరేగా వుండేది నిజంగాదు. పోనీ, ఆ తేడా తరాత్తర్వాత నశించిపోతుందన్నప్పటికీ [పదుగురాడుమాట పాడియై ధరజెల్లునని నేడిసినప్పటికీ కూడా] "గొడ్రాలికొడుకు గోలొక్కండ నేలాడు!" అనే వాళ్ళ మాటలు సత్యంగాదు గదా! ఎవళ్ళూ నమ్మరు కూడా కదా! కాబట్టి యివన్నీ కూడా శాస్త్రాన్ని అశాస్త్రీయంగా చెప్పడమే తప్ప వేరుకాదని తెల్సుకో...

అది కూడా పక్కన పెట్టి చూద్దాం. యదార్థాన్ని కాస్తంత తేడాపాడాగా చెప్పడమే "సదసత్" అనుకుందామంటే - "తేడా" వచ్చినప్పుడే సత్యం కాదు కదా!— కల్తీ నెయ్యి కల్తీనెయ్యేగాని - నెయ్యి గాదుగదా!- కాబట్టి అదంతా ఎరువు సొమ్ము వేసుకుని ఏ పేరంటానికో వెళ్ళే డాంబికమే తప్ప - స్వభావం కాదు. ఇదంతా డబాయింపే గాని మరోటికాదు. కాబట్టి దాన్ని పూర్తిగా వదిలెయ్!

"కల" కనబడుతుంది గనక, అది నిజమంటావా? నిజమే అయితే - మెలకువలో కూడా జరగాలి గదా!

పోనీ - అది (కల) అబద్ధమంటావా? ఆ కలగనేప్పటి సుఖమో - దుఃఖమో అనుభవిస్తున్నాం గదా! దాన్నే సద

సత్యంగాదామా అంటే, అది విరోధాభాసం అవుతోంది గదా! - ఎందుకంటే, కలలో - లేనివి (ఎండమావిలో లేనివి) కూడా కనిపిస్తాయికదా! అవి అప్పటికి సత్యంగానే భాసిస్తాయి కదా! అంటే — ఉన్నదున్నట్టు లేదు, అలాగని లేనట్టూ లేదు, దానికి మధ్యలో లేనిదున్నట్లనిపిస్తోంది, చివరికి - మెలుకువొచ్చేసరికి యేదీ లేకండా పోతోంది. ఏదీ లేక డా పోయేది ఎప్పుడూ వుండే "సత్యం"లో భాగమెలా అవగలుగుతుంద ?

అంచేత — "సత్" అనేది అజ్ఞానులకు మాత్రమే భేదరూపాలు కనిపిస్తుందిగాని, జ్ఞానులకి మాత్రం కాదు. అదంతా 'జగత్తు'లాగా, 'జీవకోటి' లాగా మిథ్యే తప్ప 'తథ్య' కాదు.

ఈ భేదాన్ని దాటివెడితే — 'స్వజాతి' 'విజాతి' 'స్వగత భేదం' అని మరో మూడు విషయాలు ముందు కొస్తాయి. నిజానికి, ఆత్మకి మూడూకూడా లేవు. స్వ - వి - జాతులు రెండూ మాయా కల్పితాలే తప్ప అన్యంకావు. ఇవన్నీ కూడా బ్రహ్మన్‌లో అనంగీకారాలే. ఆ పరబ్రహ్మ మెప్పుడు స్వయం ప్రభాయుతమే. స్వజాతి, స్వగత భేదం, అహంకారం, మమకారం అనేవి లేకండా మహాజ్యోతిర్మయమైన చిన్మాత్రగా మాత్రమే భగవంతుడుంటాడు.

పై విధంగా అనేకమైన నామరూపమయ విధానాలతో చెప్పబడుతున్న ఈశ్వరుడు ఆ భేదాలనన్నిటినీ అధిగమించి నప్పుడు మాత్రమే ఆత్మ స్వరూపుడై-జ్ఞానొక్కడేమై ప్రకాశిస్తాడు.

ఎడ్డెం అంటే తెడ్డెం అనే తర్కాలన్నీ అక్కడ తల లొంచేసాయి. షడ్దర్శనాలూ సమసిపోయాయి. నేను—నువ్వు (త్వమేవాహం) అనేమాట వేలన పడిపోయింది. మాయ మట్టమైపోయింది. ఆ మహాత్ముకి తుది మొదళ్ళు చెప్పలేక వేదాంతం వీగిపోయింది. కర్మ స్వప్నాలన్నీ దివిటీలు కొట్టేశాయి. మరుపు-గుఱుతు అనేవి మాసిపోయాయి. తాను-నేను (సోఽహం) అనే మాట సోదిలోకి రాకండా పోయింది. అక్కడ కేవల పరబ్రహ్మమై, స్వయం ప్రకాశమై, నిత్యానందమై, విశేషాలన్నింటికీ చివర శేషించిందేదైతే వుందో ఆ ఆత్మవే నువ్వయ్యా!

ఇలా ఆత్మ అని చెప్పబడే వస్తు వేదైతేవుందో ఆ వస్తువే-ప్రాణికోటి కంతటికీ జీవస్థానం. విశ్వ విలాసమంతా అదే. బ్రహ్మాదులు కూడా దానిని చేరలేరు. అది స్వయం ప్రకాశం.

ఆ వస్తువున్నే నేనని ఎందాకా నువ్వు భావించుతావో అంతవరకూ అది నీకు కనిపిస్తూనే గోప్యంగా వుంటుంది. గుఱుతులూ మఱుపులూ లేని తెలివే నీ నిజ స్వరూపంగా గుర్తించగలిగిన జ్ఞానాని కూడా అతీతమైన-స్వయంప్రకాశమానమైన జ్ఞాన మందిరమది.

దేన్నయితే నీ మనసు మాయగా భావిస్తోందో దాన్నల్లా వదిలేస్తూ ఆత్మదర్శనంవైపు ప్రయాణం చెయ్యి. సంకల్ప వికల్పాలులేని ఆ 'సరుకు'ని పట్టుకో. ద్వైత మనే పిచ్చిలో పడకు.

పట్టూ విడుపూగాని, చల్లదనమో వేడోగాని, చిన్నతనమో పెద్దతనమోగాని, రాకపోకలుగాని, స్థిరపడ్డంవల్ల

పాడైపోడం అనేదిగాని - ఇవేవీ లేనిదే ఆత్మ, ఆత్మ తానే పనీ చేయడు, ఎవరిచేత చేయించడు. చేతో చిత్తోపాయాల కందడు, భోగముకాడు, భోగ్యమూకాడు. అహంకారం లీనమైపోగా జ్ఞాపక రూపమైన తానే తానుగా భాసించే ఆ 'ఆత్మ' ఇలాటిదని ఎలా చెప్పగలమయ్యా!

విధి విహితాలైన ఏ కర్మలకైనా సరే తుదిగాని, మొదలుగాని కాదు. విస్తరించిందీ కాదు. విస్తరించబడేదీ కాదు. చలించేదీకాదు. ఈ ప్రపంచానికి అతీతంగా వుంటుంది. అలాగని ఎక్కడో వుండదు. ప్రపంచమంతటా తనే పరుచుకునుంటుంది. దాని ముందు మన తెలివితేటలు వేటికీ కొరగానా వుండదు. మొత్తం అన్నీ ముడుచుకు పోవలసిందే. జీవుడికి జోడాగా చెప్పే దేవుడూ అదే. నీ అసలు రూపం అదే. కారణాలకీ, ఉదాహరణలకీ అందకండా, ఉపమించడానికి వీల్లేని ఆనందానుభవ సౌఖ్యఫలంగా, ద్వైతం, అద్వైతం అనే రెండూ లేకండా విరాజిలే పరమతత్వం అదే. అష్టాంగ యోగాలూ- వేద శాస్త్రాలూ - ఆసనాలూ గీసనాలూ వల్ల అది అందదు. కేవలం స్వానుభవంతో మాత్రమే దాన్ని పట్టుకోవాలి.

ఆ పరబ్రహ్మం తాను మాట్లాడదల్చుకుంటే తన స్వస్వరూపంతోనే పలుకుతాడు. లేదనుకో— కిమ్మనకండా తన వెలుగులో తనే లీనమైవుంటాడు.

తాను తానైన పరబ్రహ్మం అదేనయ్యా! కొందరి తెలుసుకునికూడా - ఏమీ తెలియనట్లుండిపోతారు. వారి పాలికది 'నిశ్శబ్దో బ్రహ్మ' మని చెప్పబడుతోంది.

ఆటున్నోకటో పాఠం సమాప్తం

# వివేకసింధువు

## ఎనిమిదో పాఠం

శిష్యుడడుగుతున్నాడు—

పరమోత్కృష్టమైన ఆ శుద్ధ పరబ్రహ్మంలో నేనెలా కలిసిపోగలుగుతాను? అది నాకొంచెం విడమర్చి విన్పించు.

గురువు సమాధాన పరుస్తున్నాడు-

ఎప్పటి దాకా అయితే జీవుడూ - దేవుడూ అనే జంఝాటంలోంచి బైటపడి చైతన్యాన్ని పుంజుకోలేపో- అప్పటిదాకా తత్-త్వం పదాల మధ్య భేదం మాసిపోదు. కాబట్టి-ముందుస్తుగా- అన్ని ఉపాధులకీ వున్న కార్య కారణాల ఏకత్వాన్ని ముఖ్యంగా తెల్సుకోవాలి. అసలా పరమతత్త్వం అనేది - తనకి తానుగా "అద్వైత" మని గుర్తించాలి.

మృదువైన శీలం సంపత్తి గలవాడా! లౌకిక విషయాలనే అడ్డదిడ్డపు తీగెల్నీ - డొంకల్నీ తెగనరికే కొడవలి వంటివాడా! చెబుతున్నాను పట్టు.

దేవుడి శరీరమైన బ్రహ్మాండానికీ, జీవుడి శరీరమైన పిండాండానికీ పనితనం ఒకటే కాబట్టి, ఈ రెండింటికీ ఏమీ తేడా లేదు. ఇవతని స్థూల ప్రపంచ మహాభూతాధికారణంగా తెల్సుకో. తద్వారా పిండాండ బ్రహ్మాండాలు రెండూ కార్య

కారణాలుగా తేలడం వలన - కార్య కారణాలు అభేదాలని గుర్తించు. ఎందుకంటావేమో - ఎక్కడ 'కారణం' లేదో అక్కడ 'కార్యం' వుండదు. గాలిపటానికి దారమూ పట మూ యో-నగా-బంగారమూనో-ఆ విధంగా నన్నమాట!

ఇక బ్రహ్మాండానికి 'సృష్టి', పిండానికి 'మెలకువ' అనేవి అవస్థలు. ఇవి రెండూ ఒకటే కదా! కాబట్టి, అవస్థ లలో భేదం లేదు.

మెలకువకి విశ్వుడు-సృష్టికి విరించి - ఇవి రెండూ ఏకాంశలే గనక ఆ విషయంలోనూ తేడా లేదు.

పోనీ, విత్తూ- మొక్కా- పద్ధతిగా చూద్దామన్నా- దేవుడి లింగ శరీరం - సర్వ జీవుల స్థూల దేహాలలోనూ మసలుతూండడంవల్ల అక్కడ కూడా ఏకత్వమే తప్ప- భిన్నత్వం కనపడదు. అగ్నినుంచి ఛటచ్ఛటారావాల్తో విర జిమ్మబడే అగ్ని కణాలు ఆ అగ్నికిగాని - గంగా తరంగా ల్లోంచి చెదిరిపడే నీటిబిందులు ఆ గంగకికాని - ఇతరాలు కానట్లే, జీవులు శరీరాలన్నీ ఈశ్వరాంశగా తెలుసుకో. అందువల్ల, దేవుణ్నుంచి జీవుడభిన్నుడే అవుతున్నాడు.

ఇక - స్థితికీ పాలనకీ అభిమాని విష్ణువు. ఆ లింగ దేహాభిమాని తైజసుడు. వీళ్ళిద్దరూ భిన్నులుకారు. నిద్రకీ- ప్రళయానికీ రుద్ర - ప్రాజ్ఞులధిపతులు గనక - వాళ్ళిద్దరూ ఒకటే గనక ఏడంలేదు. పైగా, నిద్ర - సంహారం అనేవి

రెండూ తమో భూమికకి చెందినవే గనక ఆ రకంగా కూడా తేడా లేదు దేవుడి శక్తియైన మహామాయకీ - జీవుడియొక్క అజ్ఞానానికీ తేడా ఏముంది చెప్పు? ఇంకీ పిండ బ్రహ్మాండాలు రెండింటికీ సర్వసాక్షిత్వం—ఈశ్వరత్వం తుర్యమే గనక అది కూడా వేరనలేం. జీవుడూ దేవుడూ యిద్దరూ కూడా తమ తమ ఉపాధి ధర్మానుసరణులే గనక అక్కడా భేదం కన పడదు.

వెంటనే కలగ చేసుకున్నాడు శిష్యుడు -

"వేద శాస్త్రాలన్నీ భేదాన్నే చెబుతున్నాయి గదా! సద్వాసువర్ణ సంయోజ్యం శాఖాయాం-అని శ్రుతులు చెప్పే భిన్నత్వాన్ని అశాస్త్రీయ మనడం ఎలా కుదురుతుంది?"అని అడిగాడు. "అదీ చెబుతాను విను మరి"- అంటూ మళ్ళీ ఎత్తుకున్నాడు గురువు.

నువ్వు చెప్పిన ముక్క నిజానికి, అది పూర్వ పక్షాన్ని సూచించే మాట మాత్రమే. శాస్త్రీయమైన సదవ గాహనతోటీ, తెలివితోటీ-'నేతి నేతి' సూత్రరీత్యా ఈ లంప టాన్ని తొలగించుకోవాలి. వేదశాస్త్రాలా విధంగా చెప్పి నప్పటికీ కూడా, ఆ తర్వాత చెప్పబడిన ఉపనిషత్ లు, ఆ వేద వాక్యాన్ని పూర్వ పక్షం చేస్తున్నాయోయ్! ఈ భేద వాదం ద్వైత సిద్ధాంతమని నని తెలుసుకో. ముఖ్యంగా గురు మహాజన పరంపరగా వస్తూన్న "ఏకమేవాద్వితీయం బ్రహ్మ!" అనే మాటని మర్చిపోకు. దీనిద్వారా భిన్నత్వం లేదని తెలుస్తోంది గదా! అలాంటప్పుడు మళ్ళీ రెండంటే- అర్థం లేదని గుర్తించి అలాటి భావాల్ని విసర్జించేయ్.

ఘనవిరాట్టు—హిరణ్యగర్భుడు, స్థూల - సూక్ష్మాలు, సృష్టి-స్థితులు, మెలకువ - కలలు - మొదలుగా వున్న జంట లన్నీ కార్య కారణాలే సుమా! పిండాండమే బ్రహ్మాండమవు తుంది. బ్రహ్మాండమే పిండాండ మవుతుంది. సృష్టే-మెలకువ, స్థితే-కల-ఈ విధంగా ఇవన్నీ పరస్పరం ఒక్కటే. లేని పోని శంకలు పెట్టుకోకు.

గురువు చెప్పింది విని మళ్ళీ అడిగాడు శిష్యుడు-

"అయితే గురురాజా! గతంలో నువ్వు 'కల' అనేది- 'మెలకువయొక్క వాసన' అని చెప్పావు ఇప్పుడు 'కల' కారణమనీ, 'మెలకువ' కార్యమనీ చెబుతున్నావు. కార ణాన్ని బట్టి కార్యమేగాని, కార్యానిబట్టి కారణమెలా కల్పితమవుతుంది?"

"చెబుతా పట్టు" మంటూ ప్రారంభించాడు గురువు.

*—మనో వ్యాపారాన్ని బట్టి కలలో దృశ్యం.

అందువల్ల 'కల' కారణమైకూర్చుంటుంది. ఆ మిషగా 'మెలకువ' కార్య మవుతుంది. అదేదో విభిన్నాలనుకోకు. అయినా తైజసుడు విష్ణ్వంశ అనీ, విశ్వుడు బ్రహ్మాంశ అనీ, సీత ముఖకాంతలకి రాముణ్ణి చూపించిన విధానాన్నీ-ఆరీత్యా అవగాహన చేసుకున్నట్లయితే ఈ కలకీ, మెలకువకీ వున్న పొత్తు తెలుస్తుంది.

అవ్యాప్తమను, హిరణ్య గర్భమను - అజ్ఞానమును, లింగ శరీరమను-ఇవన్నీ కూడా వి త్తనంలో మట్టి చెట్టున్న ట్లుగా పరస్పర కార్య కారణాలే తప్ప వేరుకావు. అంచేత-

మాయకీ - అజ్ఞానానికీ, హిరణ్య గర్భుడికీ లింగ దేహానికీ అభిన్నతే తప్ప, భిన్నత్వం వుండదు.

ప్రళయం - నిద్ర అనేవి కారణాలు, ఉనికి - కల అనేవి కార్యాలు-ఇవి అభిన్నాలనడానికి ఏమీా సందేహం లేదు.

విష్ణువులోని తైజసవృత్తి, బ్రహ్మలోని విశ్వవృత్తి, రుద్రునిలోని ప్రాజ్ఞత్వం, రాజసాత్త్వికాలూ-అన్నీ కూడా 'తామస' మనే గొప్పదైన చీకట్లో అణగారి పోతుంటాయి.

అన్యాకృతంలో - అజ్ఞాన వృత్తితో అలరారే మహా మాయను కలిగుండే ఆత్మ జ్ఞానమనే వృత్తికీ ఏకత్వం కలుగు తుంది.

ప్రళయమే నిద్ర. సర్వ సాక్షితుర్యం. ఈ రెండూ కూడా కార్య కారణాలేగనక అభిన్నాలు. ప్రాజ్ఞుడు, రుద్రుడు- ఈశ్వరుడైన ప్రత్యగాత్మవలన ఆవిర్భవించారు గనక వాళ్ళు అభిన్నులు.

ఇవేవీ తెలుసుకోకుండానే మోక్షం పొందేద్దామనే వాళ్ళ మాటలు - ఉన్మొత్తకాయలు దిన్న ఉన్మాద వచనాలే తప్ప మరోటిగావు. అలాటి బుద్ధి తక్కువ వాళ్ళ దగ్గర ఉపదేశాలు పొందేవాళ్ళకి వైరాగ్యమెలా కలుగు తుంది? అందుచేత వస్తువును - జ్ఞానదృష్టికి చూపించలేని అలాంటి గురువుని వదిలేసి, ఇతరేతర దుర్మార్గ మతాల్లో కూరుకుపోకండా, కారణ గురువు నాశ్రయించినట్లయితే'

ఆయన దయవల్ల-సంసారం తరించేస్తామనడంలో ఆవగింజంత అనుమానం కూడా లేదు.

పాపరహితుడు, గౌరవనీయుడు, పండితుల్లో శ్రేష్ఠుడు, వేదోపనిషనాది విద్యల్ని బాగా తరచ్చూసినవాడూ, శాంత మంతుడు, ఇంద్రియాల్ని గెలిచినవాడూ, అద్వైతుడు, శుభ ప్రదమైన గుణశీలాలున్నవాడూ, బంధాల్లేనివాడూ, చేర వచ్చినవాళ్ళపట్ల అపారమైన కృప చూపించేవాడూ, దొడ్డ వాడూ అయినటువంటి కారణ గురుణ్ని సేవించినవాడు తప్పకండా కైవల్యాన్ని పొందుతాడు. అటువంటి గురువును చేరి - నాలుగు రకాలా సేవించాలి.

అయిహిక లంపటాలకి వ్యతిరేకి, జ్ఞాన వైరాగ్యాలచేత ఉన్మత్తుడు, అరిషడ్వర్గాన్ని గెల్చినవాడూ, బ్రహ్మానందాను భవ రసంలో ఓలలాడేవాడూ అయిన గురువు - భవ భయ గ్రస్తులై తానేగతని ఆశ్రయించిన వాళ్ళయొక్క అజ్ఞానపు చీకట్లని సిద్ధాంత దీపంతో హరించి-రక్షిస్తాడు.

ఆ గురువులద్వారా అనుగ్రహించబడిన -జ్ఞాన వస్త్రా లని కట్టుకుని మోక్షకాంత రమిస్తుంది. తరాదినీ సత్పురు షుడు వైరాగ్యంతో ఆయాసపడుతూ కృశించిపోతాడు... (అంటే దేహశక్తి చచ్చి - ఆత్మోద్దీపనమవుతుంది.)

వేద వేదాంత పఠనల ద్వారా మోక్షం పొందవచ్చు నని చెప్పనటువంటివాళ్ళు- కేవలం 'స్మరంతి' గాళ్ళే. మోక్ష మనేది చచ్చింతర్వాతొస్తుందని చెప్పేవాళ్ళని నమ్మకొళ్ళే వాళ్ళు చాలా చెడ్డవాళ్ళు సుమా! చచ్చింతర్వాత మళ్ళా

మనుష్యులుగా పుడతారని చెప్పేవాళ్ళూ, నమ్మేవాళ్ళూ కూడా పామరులే! అలాంటి వాళ్ళంతా గురువులనే బిరుదులు తగిలించుకుని - లేనిపోని పాషండమతాలూ గట్రా నేర్పుతారే తప్ప - ఉద్ధరించరు. బుద్ధిమంతులు పసిగట్టి మసులు కోవాలి.

నిత్యం బ్రహ్మానందమనే అమృతాన్ని గ్రోలేవాళ్ళు - సచ్ఛీలురూ, వివేకవంతులు కావడంవలన - తుచ్ఛమైన ఇతర వృత్తుల జోలికి వెళ్ళరు.

ఇలా నేను చెబుతున్నవన్నీ వెఱ్ఱి మాటల్లా అని పించొచ్చు - అయినా విను. చెఱకు నల్లగావున్నా, దాని సారం తియ్యగా వున్నట్లు - నా మాటలు కూడా - క్రమ క్రమంగా మయ్యాక తెలుస్తుంది. అయినా - ఎవరికేది యిష్టమైతే దే రుచిగా వుంటుంది గనక - కర్మ జీవులకి నేచెప్పే ముక్తి బోధలు నచ్చకపోవచ్చును. ఇంతకు పైన గురు లక్షణం చెప్పాను. ఇక మీదట శిష్యలక్షణం కూడా చెబుతాను.

గురుభక్తి లేనివాళ్ళూ, మోసగాళ్ళు, హింసాత్మక విద్యా నిపుణులూ, దొంగలు, పాషండాది మతజ్ఞానంవల్ల గర్విష్ఠులూ, నీచ సంభాషణలు చేసేవాళ్ళూ, నాటు రకం హాస్యపరులూ, కృతఘ్నులూ, కుజనులూ పాపాల్ని గర్వంగా చెప్పుకునే వాళ్ళూ, చెడు ఊహలు చేసేవాళ్ళూ, అభిచార మారణోచ్చాటన స్తంభన వశ్య మోహనమంత్ర వాదులకీ, ఆలస్యపరులకీ, కర్మధులకీ,

అహంకారపరులకీ, నాస్తికులకీ, జ్ఞానాన్ని అపహరించాలని చూసే వాళ్ళకీ, సభల్లో తన గొప్పతనం కోసం గురువుని, ప్రాధేయపడేవాళ్ళకీ, గురువుని ఆక్షేపించే వాళ్ళకీ, గురువు మీద కోపించేవాళ్ళకీ గురువుని తనలాగే అజ్ఞానమయ శరీరుడిగా భావించి అతి చనువు చూపించే వాళ్ళకీ - వీళ్ళెవళ్ళకీ- ఈ ఆత్మ విద్య అనబడే బ్రహ్మజ్ఞానాన్ని అనుగ్రహించకూడదు. ఇక మంచి శిష్యుల గురించి చెబుతాను.

పైన చెప్పిన దోషాల్లేనివాడూ, సంసార హింసలు పడీ పడీ, జిజ్ఞాసువూ విరాగీయైనవాడే సచ్ఛిష్యుడు.

గురుభక్తులు, కల్మషం లేని అంతఃకరణ కలవాళ్ళూ దాన గుణం వున్నవాళ్ళూ, గురువుకీ దైవానికీ భేదాన్ని పాటించనివాళ్ళూ, నిశ్చల స్వభావం కల వాళ్ళూ, సాధు సంపత్తి కలవాళ్ళూ, నిత్య సంతోషులూ, సందేహాల్లేని వాళ్ళూ, ఎప్పుడూ నిజమే చెప్పేవాళ్ళూ, చేపట్టిన దాని పట్ల దృఢమైన దీక్ష కలవాళ్ళూ, రాగద్వేషాల్లేని వాళ్ళూ, విషయ వాసనల్ని వదిలేసిన వాళ్ళూ, ధన విషయంలో గురువును దగా పరచాలనే బుద్ధిలేనివాళ్ళూ - ఇటువంటి వాళ్ళు గురువుల నుంచి బ్రహ్మజ్ఞానాన్ని పొందేందుకు అర్హులు.

పరసువేది తాకితే - లోహం బంగారమైనట్లు - గురు సన్నిధానం జిజ్ఞాసువుని-జ్ఞానిని చేస్తుంది. అలాంటి మంచి శిష్యుల్ని చేరదీసి గురువు సాధన చేయించాలి. యోగాభ్యా

సార్థం మంత్ర జపాది సాధనల్ని బోధించాలి. అష్టాంగ యోగాల్ని అభ్యసింప చేయడంవల్ల-చిత్త వృత్తి నిరోధించ బడి శుద్ధ మవుతుంది. అలా కాని పక్షంలో గురువు శిష్యుడి చేత సేవలు చేయించుకోవాలి. ఆ సేవలద్వారా కూడా శిష్యుడికి చిత్తశుద్ధి వెంటనే కలుగుతుంది. చక్కటి జ్ఞానం అబ్బుతుంది. గురు అనుగ్రహమే స్వస్వరూపమై భాసిస్తుంది. పరసువేది సోకి అష్ట లోహాలూ బంగారమైనట్లు - జిజ్ఞాసువు లంతా తరించిపోతారు.

ఏదో ఉదాహరణకి పరసువేది అంటామేగాని, గురువు పరసువేదికన్న చాలా గొప్పవాడు. పరసువేది - ఎనిమిది లోహాల్ని బంగారం చెయ్యగలడేగాని, తనలాగా తాకిన దాన్నల్లా బంగారంచేసే మరో పరసువేదిగా మార్చలేదు గదా! కాని, గురుడలా కాదు - శిష్యుణ్ని తనంతవాడి గానూ చేస్తాడు ...శిష్యుణ్ని గురుస్థాయికి పెంచుతాడు. తల్లిదండ్రులు సంసార దాయకులు గనక, వాళ్ళకన్నా కూడా గురువే గొప్పవాడు. ఇక కల్పవృక్షం - కామధే నువూ అంటావా! అవన్నీ అడిగిన విచ్చగలవేగాని - ఆత్మ జ్ఞానాన్నివ్వలేవు. చింతామణి - చింతించిన దాన్నిస్తుందే గాని - గురుడు చింత నాతీతమైన బ్రహ్మజ్ఞానాన్నిస్తాడు. కాబట్టి గురువీయన్నిటికన్నా అతీతుడు సుమా!

ఇక ఈ బ్రహ్మజ్ఞానమనేది ఎవరు అర్హులో, అధి కారులో, సత్పాత్రులో వారియందే నిలుస్తుందితప్ప-డాంబికు లకు మాత్రం నిలవదు. తంత్రీ ఆ స్త్రిమీద సుపుత్రులకే

కాని—కుపుత్రులకి అర్హత లేనట్లే - డాంబికులకి గురుదత్త జ్ఞాన పట్ల అధికారం వుండదు అందుకు గురువే మాత్రమూ కూడా బాధ్యుడు కాదు.

ఈ విధమైన గురుబోధనానంతరం -తాపత్రయాగ్న్యుల చేత ఉడికిపోయినవాడు-జప తపాది నాలుగు రకాల సాధనల లోనూ నిష్ణాతుడూ అయిన శిష్యుడు గురు పాదాలకు నమస్కరించి—

—గురుదేవా! అతి చెడ్డవైన విషయ వాసనలనే మురికి నీటితో నిండినదీ, ప్రమాదమనే మొసళ్ళతో కూడినదీ అయిన సంసారమనే గొప్ప సముద్రంలో చిక్కుకుని, తాపత్రయాల బడబాగ్ని కీలల చేత జుట్టబడి వున్నాను. నా మొఱ నాలించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. నన్ను దయ జూడు.

జ్ఞానమనే నావలోకి యెక్కించి, నీ అనుగ్రహామనే తెడ్డును ప్రసాదించి - భయంకరమైన ఈ సముద్రాన్ని దాటించు. భీకరమైన సంసారమనే అడవిలో తాపత్రయాలనే దావాగ్ని చేత దహించబడి, ధైర్యం కోల్పోయి నీ పాదాల నాశ్రయించాను నన్ను జ్ఞానపదానికి చేర్చు. గొప్పదైన సంసారమనే చీకట్లో మునిగిపోయి అజ్ఞానమనే గొలుసుల్లో ఇరుక్కుపోయాను. నీ దయ అనే ఆయుధంతో-ఈ బంధాన్ని నరికి పోగులోసై. ప్రేమతో నన్ను కాపాడు-

ఇలా అనేక రకాలు ప్రార్థించి, పదే పదే పాదాలంటి, పడిపడి దుఃఖిస్తున్న - ఆ పాదుడికేసి తేరిపార చూసి - దయాంతః కరణాలు తేటపడగా, ఆ గురువు అభయమిచ్చి—

—క్షణంలో నీ బంధాలన్నీ చటుక్కున తెగిపోయేలా చేస్తాను. నువ్వేం కంగారు పడకు-అని, అతని తలమీద తన పవిత్రమైన చేతిని వుంచి - గురు సాంప్రదాయ రీత్యా శాంభవీ ముద్రా విధానంగా అతనికి స్వస్వరూప జ్ఞానాన్ని తెలియ చేశాడు.

అంతటితో ఆ బాధితుడిలో జ్ఞానం ప్రవేశించింది. అతని చైతన్యం స్వయం బోధా ప్రకాశమానమైంది. శరీరం కంపించింది. రోమాలు నిక్కబొడిచాయి. చర్మం పండా చెమ్మటలు క్రమ్మాయి. సాత్త్విక భావబలంతో రాజయోగాభిషిక్తుడయ్యాడు. స్వానుభవంలో ముక్తి కాంతను తెల్సుకున్నాడు. భవ భయాలు లేనివాడయ్యాడు. అన్ని అనుమానాలూ పటాపంచలై పోయాయి. భ్రమలు చెదిరి పోయాయి స్వచ్ఛల స్థితికి వచ్చాడు.

అతనలా ఆనందమన్నుడై యుండగా, స్వానుభవామృతం అనే నది ప్రవహిస్తోంది. అది మామూలుగా కాకండా అపడానికి వీల్లేనంత వడిగా ప్లవిస్తోంది.

అదురుకి మమకారమనే చెట్టు మొదలంటా పడిపోయింది. ఆ చెట్టుమీదున్న తృష్ణ, వాంఛ మొదలైన పక్షులు వాటి గూళ్ళతో బాటే ఆ నీళ్ళలో కొట్టుకు

పోయాయ్. ఇంద్రియ గ్రామాలన్నీ విషయ - వాసనా - వృత్తులతో సహా వరదలోపడి ఎటో పోయాయి. పరసుఖమనే హంస తూలికా తల్పంమీద ముక్తి కాంతతో ఉపవాహన సౌఖ్య ప్రాప్తుడై నిత్యుడై వుండసాగాడు.

ఆ విధమైన మోక్ష కామినీ రమణం వల్ల - అన్ని రకాల విషయాలతో సహా మనస్సు కుదుళ్ళతో సహా కదిలి లయమైపోయింది. అతనేకాకిగా యోగవియోగ రహితంగా మిగిలాడు.

ఈ విధమైన ఆత్మజ్ఞానంతో - ఏ యితర ధ్యాసా లేకండా వుడిపోవడాన్నే 'యోగనిద్ర'అంటారు. అనంతరమా రాజయోగి, చెడనిదీ - చెరపలేనిదీ అయిన గొప్పదైన శివయోగ రాజ్యపద గౌరవాన్నందుకుని గురువృత్తిని సుఖించాడు.

గుర్తింపు - అది లేకపోవడం, భావాభావాలూ అనే వేవీ లేకండా యుక్తి ముకితి ముద్దరాలిచే సంభావించ బడ్డ వాడై-శైవ మహాయోగ సామ్రాజ్యంలో సుఖించాడు. అనంతరం-మోక్షాన్ని పొందాడు. చిచ్ఛక్తి - సమస్త స్వర్గ భోగాదుల్నీ-దీపాలుగా తీర్చిపెట్టే-ఆ పరమ పదానందాన్ని తెలిపిన వాళ్ళకి తెలుస్తుందేగాని, తెలియని వాళ్ళకేం చెప్ప గలం! మనసులో ఊహించలేం. మాటల్లో చెప్పలేం -

పక్షి రెక్కలల్లాడిస్తూ నింగిలో ఎగురుతున్నా ఆకాశాన్నంటినట్లే-తన ఆశ్రయంలో - ఇంద్రియాది మనోవ్యాప్తితెన్నున్నా వాటి సతడు అంటనే అంటడు గదా! అటువంటి యోగులకి సిద్ధించనిదంటూ ఏదీ వుండదు. అతన్ని వర్ణించడంగాని, పొగడ్డంగాని - బ్రహ్మాది దేవతలకే సాధ్యం కాదు.

సరే! ఈ కథనిలా వుంచు. అత్యంత దుర్లభమూ చెప్పడానికి శక్యంకానిదీయైన ఇంకో చిత్రాన్ని వినిపిస్తాను పట్టమంటూ—గురువారంభించాడు.

— ఎనిమిదో పాఠం సమాప్తం —

# వివేకసింధువు

## తొమ్మిదో పాఠం

స్వానుభవాన్ని చెబుతున్నాను. సావధానుడవై విని, నిజానుభవ సిద్ధిని పొందు- బైట చూపు లేక - లోచూపులు చూస్తూండగా—

స్వానుభూతి అనే స్త్రీతో జతగట్టి తుర్యంలో ఒక మహా పురుషుడు తోచాడు. ఉత్తముడైన యోగి కళ్ళు తెరిచి బాహ్యాన్ని చూసినా, కరుణా ప్రవృత్తులు క్రమ్మినా కూడా-స్వానుభవ గౌరవాన్ని వదులుకోడు.

ఆ సమయంలో ఇంద్రియాలయొక్క ప్రకాశమానమైన వృత్తులావిర్భవించగా పరమానందోల్లాసాలై -పూర్వపు వాసనల్ని పుట్టుకున్న తెం చేసుకుని, శుద్ధ వాసననే పొందుతాయి.

ఎంతో బరువును మోస్తూ, బహుదూరం నడిచొచ్చిన ఎద్దు, గోష్ఠికిచేరి, నాలుగ్గడ్డిపరకలు నోట్లో వేసుకుని, కాసిన్నీళ్ళు త్రాగి పడుకుంటే-సుఖ నిద్ర చెంది లేవలేనట్లే, తాప దవాగ్నులచేత ఉడికించేయబడ్డ ఇంద్రియాలు బ్రహ్మామందు సర్వదా సుఖిస్తూనే వుంటాయి.

ఏ భ్రమలో కప్పి, ఒక వేళ, ఏ పూర్వాశ గుణ విశేషాలో లేచి - అలా ప్రవర్తించినా ఉముకిడిచిన బియ్యంలా వుంటుందే తప్ప - చెడిపోడమనేదే వుండదు.

గురువు చెప్పింది వినగానే ఎక్కడలేని సంభ్రమాశ్చర్యాలూ తనని ముంచెత్తుతుండగా - శిష్యుడు - గురువుకి నమస్కరిస్తూ—

—మలినంలేని ఆకారం కలవాడా, నీకు జయమగును గాక! భక్తులపాలిట మందార (కల్ప) వృక్షమా, నీకు జయము! ఏ విధమైన వికారాలూ లేనివాడా, సందేహాల్ని దూరం చేసేవాడా, నీకు జయం! చక్కటి దయగలవాడా, నీకు జయం! పుణ్యమే శీలంగా గలవాడా, నీకు జయం! యదార్థ రమణుడా, చెడ్డవారి ఘాలాలకి చెడుచేసే వాడా, (చెడ్డవారి పాలిట త్రినేత్రుడా) నీకు జయమగుగాక! దుష్టమైన జన్మను నాశనం చేసేవాడా, సర్వలోకాలకీ యజమానుడా, చిదాకాశంలో ప్రకాశించేవాడా, సత్ చిత్ ఆనంద మయుడా! పావనుడా, ముకుందుడా, శివుడే హృదయంగా గలవాడా! ముని హృదయాల చీకటిని నశింప చేసేవాడా, అమృతంలాటి మాటలు మాట్లాడేవాడా, పరమహంస స్వరూపుడా సముల్లాసుడా, మోక్ష యువతితో విలాసాలు సాగించేవాడా, భక్తులకూ-మంచివాళ్ళకీ విధేయుడా, గురువులందరిలోనూ రాజు వంటివాడా, నీకు జయం! నీకు జయమగుత! నీకు జయం కలుగ్గాక!

చాలాకాలం జీవుడినై పడున్న నా నిజరూపాన్ని నీ గొప్పదైన బోధతో తెలియచేశావు. అభిమానాన్ని అంత

రింప చేశావు ఏ స్పృహా లేనీవస్థలో నా దృష్టిని - నా లోప
లికి మళ్ళించి, నన్ను నాకు చూపించావు మీ దయతో
బ్రహ్మాను దర్శించాను.

ఇంతటి గొప్పదైన పరమానంద సౌఖ్యాన్ని ప్రసా
దించి నన్ను రక్షించిన మీకు ప్రత్యుపకృతిగా దబ్బిద్దామని
వుంది. కాని, ఇహమంతా నశించేదే గనక - అవినాశనమైన
బ్రహ్మాను చూపించిన మీకు అదివ్వడం బాగుండదనుకుంటు
న్నాను. అసలేదిచ్చినా నీ ఋణం తీర్చుకోలేను. కల్ప వృక్షా
న్నిచ్చిన వారికి-అద్దంలో ప్రతిబింబించే ముత్యాలదండ వేసి
నట్లు, చింతామణి నిచ్చిన వాళ్ళకి గాజుపూసని చేతిలో పెట్టి
నట్లూ అవుతుందేగాని, యితరం కాదుగదా ! కాబట్టి,
మీ కేమిచ్చుకోడానికీ అసమర్థుణ్ణే.

కప్పెట్టినంతటి నా అహంకారమూ, నీ చూపు సోక
గానే సురిగి పోయింది. తెలుసుకోడానికి వీల్లేని స్వస్వరూప
దర్శన తేజణ్ణమ్యాను-నీ అనుగ్రహంవల్ల. ఏ రాజవీధుల్లోనో
చిప్పట్టుకుని అడుక్కుతినేవాణ్ణి తెచ్చి రాజుని చేసినట్లు-చైతన్య
హీనుణ్ణి-పశువులా ప్రవర్తించేవాణ్ణి అయిన నన్ను గురుస్థానీయ
మైన సింహాసనంమీద కూర్చోబెట్టావు. నీకే మిచ్చుకో
గల్ను! నా జీవ ధనాన్నే నీకు సమర్పించుకుని - ఒక్క నమ
స్కారం చేస్తాను. స్వీకరించు—

అని ప్రార్థించాడు. అతని మాటలవగానే గురు వందు
కున్నాడు-

-గురువుచేత వుపదేశించబడి, ఆ గురువుయందు భక్తి చూపించని శిష్యుడు అధోగతులకి పోతాడు. కపట బుద్ధితో చేసే ఉపచారాలన్నీ వినాశనాలే అవుతాయి. అటువంటి వాడు దుర్గతుల పాలైపోతాడు.

గురువు చెప్పడం ఆపగానే శిష్యుడెత్తుకున్నాడు-

--నీ గొప్పతనాన్నెలా చెప్పమంటావు? నా అజ్ఞానం మొత్తాన్నీ అరనిమిషంలో ఆర్పేశావు సంసారమనే తెగులు తగిలి, ఇప్పుడా అప్పుడా అన్నట్లున్న నాకు జ్ఞానమనే మందేసి, గురుభక్తి అనే పథ్యం తినిపించి స్వస్థుణ్ని చేశావు. ఇదెంత ఆశ్చర్యం! చచ్చిపోయే వాడికి ప్రాణమిచ్చి కాపాడిన వాళ్ళకి ప్రత్యుపకారం చేయడం ఎంతమాత్రమూ సరిపోదు. వాళ్ళకి సేవలు చెయ్యడమొక్కటే కృతజ్ఞత.

శిష్యుడలా అన్నాడో లేదో, గురువు మొదలెట్టాడు-

-అబ్బాయ్! గురుకృప ఫలించిందీ అనడానికి కొకటే గుర్తురా! ఆ శిష్యుడికి గురువుపట్ల గల భక్తి దిన దినాభివృద్ధి చెందడమే. అలా ఎవరికి భక్తి హెచ్చుతుందో వాళ్ళనే సుజ్ఞానులంటారు.

ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ, టక్కుటమారాదులనూ; లేదా అలాంటి వింకా యింకా మాయా మంత్ర తంత్ర శాస్త్రాలనూ; అలాంటి వాటన్నిట్లోనూ చక్కగా వుపదేశాలివ్వగల గురువులూ ఇంటింటా-వూరూరా వుంటూనే వుంటారు కాని, ఈ సంసార సాగరాన్ని తరింపచేసే వాళ్ళరుదు. అందుకే సద్గురువులెక్కడో కాని వుండరు.

ఆ విధంగా పరబ్రహ్మ సాక్షాత్కారాన్ని కలిగించి, సంసార మనే సముద్రంలోంచి శాశ్వతంగా తప్పించే సద్గురువే లభిస్తే-ఆ సద్గురువుయొక్క కడకంటి చూపుమాత్రం చేతనే-సంసారపు తెగుళ్ళనీ కాలి మసైపోతాయి.

శిష్యుడు చెబుతున్నాడు-

నిజమేకదా సద్గురూ! కైవల్యమనే ఖజానా లభించింది. తద్వారా దైన్య, హైన్య, దరిద్రాలనే ఆవరణలన్నీ—నీ దయ అనే శివ నేత్రాగ్ని జ్వాలల్లోపడి బుగ్గయిపోయాయి. మునుల చేత స్తోత్రం చేయదగిన చరిత్ర గలవాడా! సద్గురువా! నీ కరుణా కరవాలంతో గొప్పదయిన నా సంసార భయాన్ని తెగేసేశావు. నాథా! ఇప్పుడున్న ఈ సుఖం ఎప్పటికీ కూడా శాశ్వతంగా వుండిపోయేలా చేసి ప్రేమతో రక్షించు - ఈ సుఖాలే నేనవుతూ పెంపొంది క్రీడిస్తాను అనుగ్రహించి ఆ మాహాత్మ్యా తెలియజేస్తే - అనాయాసంగా అందు కుంటాను. ఆ నిమిత్తంగా ప్రేమ, సమ్యక్ జ్ఞానం వంటివన్నీ నాకు నేర్పు.

శిష్యుడు కోరిందే తడవుగా, గొంతు విప్పాడు సద్గురువు—

—అన్ని కళలతోనూ కూడుకున్న చంద్రుడా! (పాండవుడా!) శిష్యుడా! నువ్వు ఇహ బంధాన్ని తప్పించు కుని, ఎదిగి పరమహా సౌఖ్యవంతుడి వయ్యావుకదా! ఇక నన్ను పొగడ్డం ఎలా సాధ్యం!

ఇప్పుడు నువ్వు నన్ను అడిగింది అందరూ అడగ్గలిగే ప్రశ్న కాదు. చెబుతా విను. నిత్యం సద్గురుని సేవించు. అలా చేస్తే నువ్వడిగిన పరమసుఖం నీకు శాశ్వతంగా స్థాయిలా వుంటుంది. నువ్వే బ్రహ్మవై వుండగలుగుతావు. ఇదంతా నీ నిజానుభవంతో తెల్సుకుని చూసుకో.

ఇదిగో చూడబ్బాయ్! అనుభవానికి ఈడైందింకో టుండదు మాటల్తో చెప్పేదీకాదు. స్థూలంగాని, సూక్ష్మంగాని కనుక్కోగలిగింది కాదు. కాల జ్ఞానంతోనూ రాదు. అది మెలకువ - నిద్ర - కలలాంటి అవస్థ కాదు, అది పని కాదు, పనికిమాలిందీ కాదు. రచించి చూపించేది కాదు. ఇది ప్రమాణం అందానికి లేదు. త్వమేవాహ మనేదీకాదు. అది కల్పితాలన్నిటినీ క్షణాలమీద కాల్చివతల పారేస్తుంది. వంట్లోంచి విషయ సుఖాలన్నింటినీ మెడట్టుకు మరీ వెళ్ళ గొట్టేస్తుంది. ఆ సుఖంముందు అన్ని సుఖాలూగాని, ఎన్ని సుఖాలు ఏకమైగాని కష్టంగానే వుంటాయి తప్ప సరితూగ లేవు-ఆ వస్తువే బ్రహ్మన్.

సర్వోత్కృష్టమైన అది - స్వస్వరూపానుభవం కలిగి నప్పుడు, స్వస్వరూప ప్రకాశమై, భవవ్యాధి నిరోధకమైన పరమసుఖ స్వరూపమై, జీవేశ్వర సమరస భావమై మహా వాక్యరసమై వుంటుంది. దాన్నే రాజయోగం అంటారు. ఆ నిర్వికల్ప సమాధానం పొందినవాడికి-తదితరాలన్నీ విషంలా వుంటాయి.

వాటినిప్పట్నించీ వదులుకుంటూ వెళ్ళాలి. విషయాల పట్ల మోహాన్నొదలాలి. విరక్తి పడాలి. మనసులో నిత్యం

పవాలక్షు కల్పనలు కలకుండా కట్టుదిట్టం చేసుకోవాలి. వేరే భావాలేవి రానీక డా ఈశ్వరుణ్ని భక్తి ప్రపత్తులతో ఆరాధించాలి. గురుపుత్రుడయిన సజ్జనుడు ఏకాంతాన్నవ లంబించి మానసిక విధిని గురుసేవ నాచరించాలి. నిర్గుణ పర బ్రహ్మాము దు ఏకీకృతమైన భావాన్ని కలిగుండాలి. ఏ విధ మైన సంకల్పాలూ చేయకూడదు. కాని ఇది చాలా కష్టం గనక, ఏవైనా సంకల్పాలు మొలకేసినపుడు - అవి పిలకేసే దాకా పెంచుకుంటూ పోకూడదు. తక్షణం నుంచే ఆ సంక ల్పానికి భిన్నంగా ఉంటే-మబ్బులు వాటికవే కరిగిపోయి నట్లు - సంకల్పాలు వాటికవే చల్లగా జారుకుంటాయి. అలా కాకండా, తనా సంకల్పాల ననుసరిస్తూ పోతేమాత్రం దుఃఖపడిపోతాడు. తద్వ్యతిరిక్తతవల్లవే నిత్య సుఖం లభిస్తుంది.

అంచేత - దృష్టిని నిరాలంబం చేసి - ఆ విషయాలు మనసులో మెదిల్తే వాటిని మిథ్యలుగా భావించి, వాటిపట్ల ఆపేక్ష పడకుండా, అసలు తనకవేవీ లేనట్లుగానే వుండాలి.

వాడెవడుగానీ, ఏ దేశంవాడుగానీ- బైటెంతగా తిరి గినా-సొంత యింటికి చేరేకే సుఖంగా వుంటాడు. ఆ స్వగృహం చేరుకున్న వాడి సుఖాన్ని చతుర్ముఖుడు కూడా పొగళ్ళేడోయ్.

ప్రవహించే నదులన్నీ కూడా ఓ చోట పోగడి పోయి ప్రవాహాన్ని విరమిస్తే, గాంభీర్యాన్ని సంతరించుకుని మహా సముద్రంగా యెలా పరిణమిస్తాయో - అదే విధంగా ఏ ఏ

విషయ భావాలెలా పరుగులు దీసినా జీవుడు తన నిజాంశతో నిశ్చలంగా నిలబడ్డట్టయితే. తానే నిష్కారణ బ్రహ్మన్‌గా మారతాడు. ఇదంతా నీ స్వానుభవంతో తెల్సుకో.

ఇంకో ముక్క కూడా విను -

మాయా లక్షణ స్వరూపాన్ముఖ స్ఫురణంగా దీప్తి మయాలైన విపరీత కల్పనలు కలుగుతాయి మనస్సు, కళ్ళు మొదలైన ఇంద్రియాలద్వారా వృద్ధపుతాయి. అవి కూడా సుఖాన్నో దుఃఖాన్నో కలిగించేవే తప్ప అన్యంగావు. అజ్ఞాన జనితాలు. కాబట్టి, కల్పనలెప్పుడు కడతేరిపోతే అప్పుడే మాయా. అజ్ఞానము కూడా మాసిపోతాయి తమలో తామే లయించుకుపోతాయి.

మోళీవాడు - చిల్లుల సొరకాయ బుర్రలో నీళ్లోసి- గాలిని బంధించి ఆ నీళ్ళు ఒలకకుండా ఆపుతాడు. మళ్ళీ గాలినొదిలి - నీళ్ళన్నా కన్నాల్లోంచి కుంపించేస్తాడు అలాగే కల్పనలెప్పుడయితే కరిగిపోతాయో అప్పుడే ఇంద్రియ స్థితు లన్నీ నిల్చిపోతాయి.

కల్పన లెప్పుడయితే లేకండా పోతాయో, అప్పుడే చావు పుట్టుకలు కూడా చచ్చిపోతాయి. పరమ సుఖంతో మనిషి సత్యానంద భరితుడవుతాడు.

గురువిలా చెప్పాక, శిష్యుడు వినయంగా తన సందే హాన్ని బైట పెట్టాడు- "సద్గురూ ! సిద్ధరోయేటప్పుడు కల్ప

నటూ అవీ, అన్నీ అణగారి పోతాయి. అలాటప్పుడు-చావు పుట్టుక లెలా తప్పుతాయి ?"

"విను మరి" అంటూ ఎత్తుకున్నాడు గురువు-

—నువ్వన్నట్లుగా నిద్దట్లో కల్పనలు లేకపోయినప్పటికీ, నిద్రనేది అజ్ఞానమయం గదా! అజ్ఞానంవల్ల భవబంధాలు యేర్పడతాయేకాని, విడిపోవు గదా! పైగా నిద్దట్లో ఎవరూ కూడా తాము "నిద్దరోతున్నా" మనుకోరు గదా! అప్పుడు ఆత్మానుభవం ఎలా సాధ్యమవుతుంది? అవదు. కాబట్టేమిటంటే, అజ్ఞానానికి చెందిన విషయ వాసనలు ఎంతకాలం వదలవో అంతకాలం జనన మరణాలు జరుగుతూనేవుంటాయి. నిద్దరోయేప్పుడు,కల్పనలన్నీ అజ్ఞానంలోలీనమయి వుంటాయే తప్ప, అంతరించిపోవని తెల్సుకో. సద్గురువుయొక్క అనుగ్రహంవల్ల, అజ్ఞానయుతమైన చీకటి తొలగినప్పుడు - ఆత్మ తన సత్ చిదానంద రూపంలో సాక్షాత్కరిస్తుంది. ఇంతటితో నీ సందేహం తీరిందనుకుంటాను. ఇంకో సంగతి చెబుతాను. జాగ్రత్తగా విను.

విక్షిప్తం, గతాయాతం,

ఆత్మానుసంధానం కుదిరిన తర్వాత, ఉన్నట్టుండి తనకి తానుగా సాధన తెగిపోడం, పునః సంసార కార్యకలాపాల్లో పడిపోడం జరుగుతూంటుంది. అలాటప్పుడు లౌకిక లంపటాల్లో పడే స్థితిని మళ్ళించుకుని,మళ్ళా ఆత్మానుసంధానంలో లీనం చేయడాన్ని "విక్షిప్తం" అంటారు.

ఆత్మానుసంధానం నుంచి విడివడి, సంసారాన్నొకసారి చూసి, యే ప్రయత్నం లేకండా తనకి తనే మళ్ళా ఆత్మాను సంధానంలో అంతర్లీనం కావడాన్ని "గతాయాతం" అంటారు.

ఆత్మాను సంధానంలో ఆనందానుభవాన్ని పొందడం 'సువిస్థిత' మనబడుతోంది.

ఆత్మ సాక్షాత్కారాన్ని పొందినప్పటికీ, ఆ బ్రహ్మానందాన్ని అనుభవించకుండా, కేవలం "ఎఱుక" రూపంగా- ఆ విధంగా ప్రవర్తించడం "సుపీనత" అని చెబుతారు.

సమాధికి చెందిన పై నాలుగూ కూడా "సమాధి భూతా"లనే పేర ప్రఖ్యాతాలుగా వున్నాయి. ఈ నాలుగు భూములీ క్షుణ్ణంగా అవగాహన చేసుకుని, బ్రహ్మ ధ్యానంతో భ్రాంతుల్నధిగమించి, ఎటువంటి ఆయాసాలూ లేకండా పూర్ణానందాన్ని పొందేవాడే రాజయోగి.

మనసు ఆత్మనుసంధానంలో లగ్నమైతే, సర్వేంద్రియాలు కూడా సౌఖ్యాన్ని చెందుతాయి. అలా కానప్పుడే అవి విషయ వాసనలవైపు పరుగెడతాయి.

దేవతలు కూడా సంబరపడిపోతూ చూసేలాగా - జ్ఞానుల చిత్తాలు బేషరతుగా బ్రహ్మాన్‌లో లీనమై వుంటాయయ్యా! ఏమిటి ఆలోచిస్తున్నావ్! "మరీ యింత విడమర్చి చెప్పాలా?" అనుకుంటున్నావా? తప్పదు మరి. గురువిలా చెప్పగానే అలా అల్లుకుపోయే నీలాంటి చురుకైన వాళ్ళే కాదు —; నాలాంటి మందబుద్ధులు కూడా వుంటారు

కదా లోకంలో...అందుకని శాస్త్రంత విస్తారంగా చెప్పా ల్సొస్తోంది!

అదయ్యా రాజయోగం. సర్వకాలాలా దీన్నాచరించే వాడు మహాపురుషుడవుతాడు. ఆ మహాత్ముడు సదా తన హృదయంలో-ఎనిమిది రకాల అర్చనలూ, పదహారు రకాల ఉపచారాలతో గురుపూజ నిర్వహించి, రజో గుణాన్నీ - తమోగుణాన్నీ తనలోంచి తరిమేసి, నిర్గుణ బ్రహ్మన్ పట్లనే నిశ్చలమైన భావాన్ని నిలిపి, తనకు తానే ఆ నిర్గుణ పర బ్రహ్మమై—పరమానందాన్ని పొందుతాడు. అలా కాకండా- ఈ అష్టాంగ యోగాలూ భక్తి ప్రసంగాలూ మాత్రాన జీవేశ్వరులయిక్యం కావడం అయ్యేపని కాదు.

ఉపద్యుక్తమై గురూపదేశ శ్రవణానంతరం-శిష్యుడు-

—గురుమూర్తీ! అసలా 'తత్' అనబడే 'వస్తు' వెలాంటిది? దాన్ని "బ్రహ్మన్" అనే ఎందుకంటారు? అసలు పరమాత్మ అగుణుడా-సగుణుడా? 'మాయ' అనేది యెవరికి శక్తిగా వర్తిస్తుంది? ఆ మాయ యెలా వుంటుంది? దాని స్వరూపమేమిటి? అజ్ఞానం ఎవళ్ళనాశ్రయించుతుంది? అసలీ ప్రపంచాన్ని రచించిందెవరు? ఇదెలా మనగలుగుతోంది? జీవుడికి చావు పుట్టుక లెలా యేర్పడతాయి? వీటికి జవాబు చెప్పు — అని అడిగాడు. "అడగాలేగాని, చెప్పడానికేం భాగ్యం! విను మరి" అంటూ చెప్పడం మొదలెట్టాడు గురువు.

—తొమ్మిదో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## పదో పాఠం

శ్రీమంతమైన కాంతులు చిమ్మేవాడా! ఎక్కడికక్కడ స్తోత్ర పాఠాలందుకుంటూ ఏడేడు పధ్నాలుగు లోకాల్లోనూ విహరించేవాడా! సత్కీర్తుల్నే దండలుగా ధరించినవాడా! మంచివాళ్ళకి ఆధారమైనవాడా! గొప్ప ఉదార గుణం కలవాడా! ప్రాపంచిక విషయ వాసనల కతీతుడా! గొప్ప గొప్ప మునులకు సైతం మంచిని కలిగించే బోధలు చేసేవాడా! జగద్గురువైన దత్తాత్రేయా! అవధరించు.

శిష్యుడడిగిన ప్రశ్నలకి గురువు జవాబిస్తున్నాడు—

—నిర్గుణ బ్రహ్మంలోంచే జీవుడు-దేవుడు— అనేవి పుట్టాయి. ఇది ఎవరికి వాళ్ళు తమ అనుభవంలో — బలమైన వివేకంతో తెలుసుకుని ధృవ పరుచుకోవాలేగాని, మాటల్లో చెప్పడం కష్టం. ముఖ్యంగా యీ బ్రహ్మజ్ఞానాభిలాషులకి 'వివేకం' చాలా ప్రధానం. ఈ వివేకమనేది చెబితే వంటబట్టేదీకాదు, చదివితే అబ్బేదీకాదు. అలా వచ్చిన వివేకం మిధ్యా వివేకమౌతూంటుంది. అంచేత ఆ వివేకం కూడా అనుభవం వల్లనే రావాలి.

చూసేదీ, చూపూ, చూడబడేదీ అనే మూడు త్రిపుటిగా చెప్పబడుతున్నాయి. ఈ మూడూ ఏకం కావడమే 'బ్రహ్మన్!' ఎక్కడయితే- తెలుసుకునేవాడు, తెలివి, తెలుసుకోబడేదీ వుండవో అదీ బ్రహ్మనే. అసలు ప్రతీవస్తువు 'పరబ్రహ్మ' తప్ప ఇతరం కాదు.

అదే జ్ఞానరూపం అందామా అంటే - అక్కడ తెలిసిందేమీ లేదు. పోనీ,అజ్ఞానరూపం అనేద్దామంటే- తెలియందంటూ ఏమీ లేదక్కడ! అదేదో 'భావం' అనుకుందామన్నా-చూడబోతే చోద్యంగా అదో శుద్ధ చైతన్యమాయె. పైగా అందులో అంతా ఆనందమే ఆనందం- గనక 'భావం' అండం బాగుండదు. సరే, అది 'శూన్యం'గా భావిద్దామా అంటే - అసలు ఆ స్మరణమాత్రం చేతనే ఈ జడమయ ప్రపంచాలన్నీ శూన్యం అయిపోతూంటే అది శూన్యమెలా అవుతుంది? పైగా ప్రత్యక్ష ప్రకాశమానం కూడా కదా!-

అంచేత-ఏమిటంటేరా అబ్బాయ్! 'బ్రహ్మన్' ఏమిటి, ఎలా వుంటుందీ అనేది - బ్రహ్మజ్ఞానులకే తెలుస్తుంది తప్ప- ఇతరులకి తెలియదు.

అసలుందా లేదా? అంటే-ఉంది. కాని పట్టుకోలేం. అయితే లేదనుకుని వదిలేద్దామా అంటే - తను మనల్నొదలటం లేదు గదా! అలాటప్పుడు ఎవరు చెప్పగలరు- దాన్ని మాటల్లో...

(15)

తను క్రియారహితుడు కాబట్టి, నిద్దరోయే వాళ్ళకి మేలుకొలుపులు పాడ్డానికీ, మేలుకొల్పులయ్యాక, హెచ్చరికలు చేయడానికీ, హెచ్చరించాక బోధన చెయ్యడానికీ - ఇలా ఓ పద్ధతిగా అంతా నియమిస్తాడు.

స్ఫటికపు కొండలా పారదర్శనమై వుండే బ్రహ్మన్‌ని ఎవరు పట్టుకోగలరు?

శుద్ధ చైతన్యమై, వ్యాప్య వ్యాపకాలకతీతమై - నిజ స్వరూపంలో నీలోనే వెలుగుతూంటుంది బ్రహ్మన్.

త్రిమూర్తులు ముగ్గురూ తమ తమ కర్తవ్యాలన్నీ తెముల్చుకుని సవృత్తినిపడే నిలయమా బ్రహ్మన్! జ్ఞానాజ్ఞాన స్పర్శలుండనిది గనక-చేరరానిదై- స్వానుభవానికి మాత్రమే సంప్రాప్తమయ్యేదే బ్రహ్మన్ !

తెలిసి పోయినట్టే వుంటుంది బ్రహ్మన్ ! అలాగనే అహంకరిస్తాం కూడా! కాని, ఈ అహంకారం అనే గుణం కాని, అది పుట్టే లక్షణంగాని మనలో వుండగా ఆ బ్రహ్మన్ ఏ మాత్రమూ పట్టుబడ్డు. ఆ అహంకారం మొత్తం చంపేసుకో గలిగితే, అటుపైన కల్పనలు కరిగిపోతే-స్వానుభవంలో బ్రహ్మన్ లభిస్తాడు.

బ్రహ్మాండ భాండాలన్నింటా బయటా లోపలాకూడా నిండివుండి కూడా - వ్యాపిస్తూంటాడు. ఆకాశంలో మేఘాలాడేటట్లే-ఆత్మానుసంధాన తత్పరులకి బ్రహ్మన్‌లో మాయ కనీ కనిపించనట్టుగా కనిపిస్తూనే కరిగిపోతూంటుంది. బ్రహ్మాది దేవతలంతా నిరంతరం ఆ ఆత్మాను సంధానంలోనే పరమా

త్మను తెలుసుకుంటూంటారు. కాబట్టి అది నిర్గుణబ్రహ్మమే. అది పూర్ణస్వరూపమే. అలాట్టి విశ్వేశ్వర విశేషమూర్తిలో యీ మాయనేది ప్రపూర్ణ చైతన్యంగా మసలుతూంటుందని తెలుసుకో. అంతకు మినహా ఆ మాయగాని, ఆ బ్రహ్మన్ గాని 'ఇదే' నని చెప్పడానికి బ్రహ్మకూడా తరం కాదు. వేదాలూ, వాటి అర్థాలూ, వేదాంతాలూ, ఉపనిషత్తులూ, శాస్త్రాలూ, సిద్ధాంతాలూ - ఇవన్నీ బ్రహ్మకి-ప్రమాణాలేతప్ప యితరంకావు. వీటికంటే యితరాలైన పాషండాది మతాలన్నీ - ఎవడికివాడు కల్పించి వ్రాసుకున్న వేగాని-యదార్థాలుకావు. కనక, నాటి నవతలపారై.

నిర్విషయము, నిర్గుణమైన బ్రహ్మన్-లో కలిగే ఒక కళే వివర్తనం. ఇది నిజాకారమై వుంటుంది. వికసితంగా వుంటుంది. సూర్యకాంతిలో తప్పనిసరిగా 'ఎండమావి' యేర్పడేటట్లే నిష్కర్ముడూ, నిష్క్రియుడూ అయిన పరబ్రహ్మన్‌లో ఈ 'వివర్తన' మనేది-గౌరవనీయ కార్యంగా తోస్తుంది. త్రాడు పాములా అనిపించేటట్లే - మాయాస్తోకమైన యీ వివర్తనం కూడాను. అందుకే కొందరు పండితులు - బ్రహ్మన్ నిర్వృత్తుడనీ, మాయే అలా వివర్తనంగా భాసిస్తోందనీ అంటారు. సాంఖ్య సిద్ధాంతులుమాత్రం దీన్ని గుణ సామ్య సంకేతంగా చెబుతారు.

ప్రకృతి పురుషులు సమాన గుణ ప్రాప్తులైనప్పుడు-ఈశ్వరుడికి 'ఉన్మని' అనే అవస్థ కలిగి, అది చైతన్యాన్నధిష్ఠించడాన్నే మహామాయ అంటారు. మహామాయ శుద్ధ

నాత్మకంగా వుంటుంది. స్వరూపానుసంధానంగా వుంటుంది. ఈ స్వరూపం అనేది గుణమేస్మా!

ఇది మిథ్యా జీవుల కుపదేష్ఠగా వుంటుంది. బ్రహ్మ వివర్తనంగా చెప్పబడుతూంటుంది. ఎప్పుడైతే 'నేనే బ్రహ్మని' అనే జ్ఞానస్ఫూర్తి మొలకెత్తుతుందో - అప్పుడది 'మహా మాయ'గా గుర్తిస్తారాచార్యులు. బ్రహ్మన్ ఎంత పరిపూర్ణ ప్రకాశమానుడో - ఈ మాయ కూడా అంతటి మహిమ తోనూ ప్రవర్తిస్తూ వుంటుంది ఈ మాయ యిలాంటిదని తెలుసుకోవడం ఎవరివల్లా అయ్యేపనికాదు. పరమయోగులు మాత్రమే కేవలబ్రహ్మను ఉండీ లేనట్లుగా సందర్శించగలుగుతారు ఈ మాయావరణం చూపించాల్సిందేం కాదు. భగవంతుడిలో ఇది వుండీ లేనట్లుగా కనిపిస్తూ వుంటుంది.

బ్రహ్మాది దేవతలకేమైనా ఇబ్బంది లేర్పడ్డప్పుడల్లా యీ మహామాయ అక్కడ తక్కున తోచి - వాళ్ళ సమస్యల్ని పరిష్కరించుతూంటుంది. గెంతులాడుతుంది నటిస్తుంది. సృష్టి కార్యార్థంగా పరమేశ్వరుడు కల్పించిన ఈ మహామాయ అనేది క్రమ్మకూడదేగాని - క్రమ్మిందో - అతిక్రమించడం ఎంతవారికైనా అసాధ్యమే...అనుభవమైన యీ మాయా ధోరణి - చెప్పడానికి వీల్లేనిది.

అయినా - బ్రహ్మన్‌లో - మిథ్యారూపంగా - ఈ మాయని చెప్పుకోవచ్చును. అసలీ ప్రపంచమంతా మాయామయమేగాని, బ్రహ్మమయమని చెప్పడం ధర్మంకాదు. అనున్నంత వరకే ఏదో తెలుసుకోవాలనే తాపత్రయమంతాను.

ఆ మాయకాని మాయ మయ్యిందిరా అంటే ఇంక తెలుసు కోడానికేమీ వుండదు.

లేకపోయినా - ఉన్నట్లు కనిపిస్తుందాకాశం. అది కనిపించూరుకుంటే బాగుణ్ను. కాని, ఇంకా అక్కడేవేవో రకరకాల ఆకారాలూ, కాంతులూ, రంగులూ, రత్నాల మేడలు, గంధర్వులు, అప్సరసలూ కనిపించే లాగానే - ఈ మాయ కూడానయ్యా !

ఆ మహామాయ నధిష్ఠించి వుంటాము గనకనే బ్రహ్మన్-ని ఆర్యులు - ప్రకృతి పురుషుడంటారు. మహామాయే మూల ప్రకృతి. పరుడైన పరమ పురుషునికి నిజ శక్తి ఆ మాయే. ఏకరూపకమైన దీనిలోంచే తత్త్వాలు పుట్టాయి.

సముద్రంలో కెరటాలు పుట్టి విరిగి - పీళ్ళు-నీళ్ళలో లీనమై పోయేట్టే - ఈ మాయ కూడా క్రమ్ముతూంటుంది. అందులోనే బ్రహ్మన్ కనపడతాడు. మళ్ళీ మాయ - మళ్ళీ దేవుడు—. మనం గనక - కనుపట్టిన దేవుళ్ళో తన్మయం కాగలిగితే - అదే దైవం యొక్క సగుణ స్వరూపమవుతుంది.

మాయ తొలగినప్పుడే తోచేది. పరమమూ - భావాతీతమూయై నిత్యం అలరారే నిర్గుణ బ్రహ్మ.

మాయోపాధి పరుడైన బ్రహ్మనే - శబళంగా చెబుతారు. సర్వ శాస్త్రాల్లోనూ సగుణంగా చెప్పబడుతున్నదే ఆత్మేనని తెలుసుకో. ఆర్యులా ఆత్మనే పరమ పురుషుడంటారు.

ఈ పరమ పురుషుడు మూల ప్రకృతికన్న వేరై, దానికి సాక్షిస్వరూప స్వభావుడిగా వుంటాడు. స్వప్రకాశుడై మూల ప్రకృతిని తెల్సుకుంటూంటాడు. ఏకాకి, అకారి, నిరాభాసుడు, ప్రకాశస్ఫూర్తిపరుడూగా వుంటాడు. స్వయ ప్రకాశాత్మ స్వరూపుడై మాయలోకి వ్యాపించి వుంటాడు. అందువల్ల ఈ జంటని వేదాల్లో 'ఆది సంసారులు'గా చెబుతూంటారు. తెలుసుకోబడేది మాయ. తెలుసుకునేది ఆత్మ. ఎరగవలసింది మాయ. ఎఱుక కలవాడు ఆత్మ. అయినప్పటికీ నాశనమనేదే లేని ఈ రెండూ కూడా ఒకరికొకరు భిన్నంగా వుంటారు.

సర్వజ్ఞత్వంవల్ల పురుషుడు ప్రకృతిని తెలుసుకుంటాడు. జడత్వంవల్ల మాయ పురుషుణ్ని చూస్తుంది. తనకి తెలిసినప్పటికీ కూడా - పోల్చుకోలేదు - పసిగట్టలేదు. అనాది దంపతులైన వారికి సంగమం అనేది లేకపోయినా, ఒకళ్ళనొకళ్ళెప్పుడూ విడిపోరు. వర్ణ రూప రహితులై శాశ్వతంగా వుంటారు. అయినప్పటికీ ఆత్మవేత్తలైన వాళ్ళుమాత్రం-నిజ స్వరూపాన్ని తెల్సుకోగలుగుతారు.

ప్రవృత్తి! నివృత్తి అనే రెండూ మాయే. మిగిలేది సృష్టి మాత్రమే.

హరిహరాజులూ మహా మహులిడి అవతార రీతులు మాత్రమే. అందువల్లనే వాళ్ళు పరశివాజ్ఞ ప్రకారం ప్రవర్తిస్తారు. ఆయన గుణాలే. త్రిమూర్తుల రూపాల్లో సృష్టి స్థితి లయలు చేస్తాయి. మాయ నుంచి మహత్తత్వం పుట్టింది. ఆ మహత్తత్వమే సృష్ట్యాదులన్నీ సమకూరుస్తుంది. అది

కేవలం మహామాయయొక్క శుద్ధ సత్వ ప్రతిభావిధమే తప్ప అన్యంకాదు. ఇక్కడ రజస్తమో గుణాలు రెండూ సత్త్వ గుణంయొక్క కడుపులో దాక్కున్నటాయి. అది పరమ కారణ దేహమవుతుంది. రుద్రునిచేత సంహరింపబడేందుకు కర్తయైనదే అవ్యాకృత శరీరమవుతుంది. దానిని నీశ్వరుడధిష్ఠించడంవల్ల మూడు రకాలైన ఆవరణ లేర్పడ్డాయి. అవి తమ తమ చేష్టల్ని ప్రకటిస్తూ వుంటాయి

సాత్త్వికాహంకారంలో జ్ఞానశక్తి, రాజ సాహంకారంలో క్రియాశక్తి, తామ సాహంకారంలో ద్రవ్యశక్తి వర్తిస్తుంటాయి. ఈ విధమైన శక్తిత్రయంలో ఈశ్వరుడి చూపు ద్రవ్యశక్తి మీదపడి - తన్మాత్ర లావిర్భవించాయి. అవి అలికిడి, తాకిడి, ఆకారం, రుచి, వాసనలై - భూత పంచీకృతాలయ్యాయి.

తమోహంకారంలోంచి - ఓం ప్రథమంగా ఆకాశం పుట్టింది. అందులో గాలి జన్మించింది. దాన్నించి అగ్ని ఆవిష్కరించబడింది. అగ్నిలోంచి నీళ్ళు పడ్డాయి. నీళ్ళలో నేల ఏర్పడింది. ఈ అయిదూ పై చెప్పిన అయిదు తన్మాత్రల్ని వరసగా వరించాయి. ఇవి కార్య కారణాలు.

చైతన్యం అధిష్ఠించడంవలన, ఈశ్వరుడి చూపు రాజ సాహంకారంపై పడుతుంది. అందులోంచి క్రియాశక్తి- దాని వల్ల-వినికిడి, చర్మం, కన్ను, నాలిక, ముక్కు అనే అయిదు జ్ఞానేంద్రియాలూ-నోరు, చేతులు, కాళ్ళు, పాయువు, ఉపస్థ అనే అయిదు కర్మేంద్రియాలూ కలిగాయి. అలా పది తత్త్వాలూ పుట్టిన అనంతరం—

భగవంతుడి దృష్టిపడి, జ్ఞానశక్తి - స్వయం ప్రకాశక మైన సాత్త్వికాహంకృతి నేర్పడించింది. తద్వారా అంతఃకరణం కలిగింది. ఈ అంతఃకరణ మొక్కటే మనసు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే నాల్గింటి కూటంగా వుంటుంది. సాత్త్వికాహంకారంనించే కర్తా, భోక్తా అనే రెండూ తనేమైన జీవోత్పత్తి జరిగింది.

ఈ అన్నింట్లో—జ్ఞానేంద్రియాలు సాధ్య సాధకాలై అన్ని విషయాలా ఉత్తమమైనవిగా వుంటున్నాయి.

తామసాహంకారం నించి పుట్టిన భూతాలూ, తన్మాత్రాలు భోగ సాధనాలుగా కనిపిస్తాయి. అహంకార త్రయంలో పున తత్త్వాన్నే ఆర్యులు 'త్రిపుటి' అంటారు. తెలిసినవాడు, లివి, తెలియాల్సింది అనేవి—పని, కారణం, చేసేది అనేవి—భోగించేవాడు, భోగం, భోగించడం అనేవి—వెరసి తొమ్మిదీ కూడా త్రిపుటీ సంజ్ఞలతోనే పిలవబడుతున్నాయి.

అంతఃకరణాలు భోక్తలు. ఇంద్రియాలు భోగాలు. అప్పుడు భోగాలు భోగ్యాలుగా పరిణమించడం కూడా జరుగుతూంటుంది. ఏ విషయానికైనా మూడు అవసరం. అన్నిటా ఆత్మ వర్తిల్లుతూంటుంది.

ఆకాశాంసలోని అయిదు భూతాంశలూ అంతఃకరణ లయిదుగా వుంటాయి. గాలిలోని భూతాంశాలు అయిదూ ప్రాణ వాయువులుగా మసల్తాయి. అగ్న్యంశా భూతపంచకం జ్ఞానేంద్రియాలవుతాయి. నీటి భూతాంశాలు

శబ్ద స్పర్శాది పంచకాలుగా పరిణమిస్తాయి. భూమియొక్క భూతాంశలైనూ కర్మేంద్రియాలైనూగా వర్తిస్తాయి. ఇవి మొత్తం ఇరవయ్యైదు తత్త్వాలు వీటిలో ఒక్కొక్క భూతాంశనీ విడిగా చూస్తే అదే పంచీకరణ మవుతుంది. జ్ఞాతృ, సమానవాయువు, చెవి, చప్పుడు, మాట- ఈ అయిదూ ఆకాశంలోని అయిదు భూతాలు. మనస్సూ, వ్యానవాయువు, చర్మం, తాకిడి, ప్రాణం అనేవి గాలి భూతాలు. బుద్ధి, ఉదానం, కళ్ళు, ఆకారం, కాళ్ళు- ఈ అయిదూ అగ్ని భూతాలు. చిత్తం, అపానం, జిహ్వ, రుచి, మర్మాంగం - ఇవి జలభూతాలు. అహంకారం, ప్రాణ వాయువు ముక్కు, వాసన, గుదం అనే అయిదూ భూమికి చెందిన భూతాంశాలు. వీటినే పంచీకరణ మంటారు.

ఒక్కొక్కటి, అయిదింటితోనూ కలిసి ఆ మహా భూతాంశను జన్మిస్తుంది. ఇది తామసాహంకారాంశ కావడం వల్ల సమస్త తత్త్వాలు అక్కడ లీనమైపోతాయి అతిచిన్నవీ, అవ్యక్తాలూ అయిన మహాభూతాలకీ, సృష్టి స్వరూప సంఘా నాలకీ కారణభూతాలై -పరస్పర్య ఒకచోట ఐక్యమవడం జరుగుతూంటుంది ఇది ఈశ్వరమాయా ప్రభావం!

— పదో పాఠం సమాప్తం —

# వివేకసింధువు

## పదకొండో పాఠం

"పంచ కోశాల గురించి చెబుతాను విన" మంటూ పదకొండో ప్రకరణాన్నారంభించాడు గురువు—

—తానే పరబ్రహ్మాన్నని తెలుసుకున్న పరమ జ్ఞాని యైన జీవుడు ముక్తి పొందుతాడని వేదాలు ఘోషిస్తు న్నాయి. జీవుడు కర్మపాశ బద్ధుడై-జనన జరారుజా మరణ గ్రస్త జీవన వేదనలలో చిక్కి, తాపత్రయతప్తుడై-ఈ కర్మ నెలా తప్పించుకోవాలా! మోక్షాన్నెలా పొందాలా అని చింతాక్రాంతు డవుతాడు. "పూర్వజన్మలో నేనెవర్నో? ఈ జన్మకిలా మనిషినయ్యాను ఈ దేహేంద్రియ-ప్రాణాది భూతాలన్నిట్లోనూ "నే" నెవరో ఎలా తెలుసుకోవాలి? ఇప్పుడు చస్తే వచ్చేజన్మలో పశువు నవుతానో, పక్షినవు తానో, మనిషినే అవుతానో ఎలా తెలుస్తుంది? నా కర్మెలా వుందో ఏమిటి? ఈ బ్రతుక్కికనైనా సుఖపనే దుందో-లేక-ఇంకా ఎక్కువ దుఃఖమే పడాల్సొస్తుందో కదా!" అనే ఆలోచనల్తో అలమటిస్తూంటాడు. ఇంకా—

"వర్ణాశ్రమ ధర్మాలూ ఆచారాలూ చేద్దామా అంటే తుట్టలు తుట్టలుగా వున్న అవన్నీ నన్ను భయపెడు

తున్నాయి. వాటిని ఆచరించడం సాధ్యమయ్యే పనిలా లేదు. పుణ్యాలెటూ చెయ్యలేక పోయాను. ఏ పాపాలు చేసుకున్నాన్రో దేవుడోయ్! అంటూ విలపిస్తాడు. కష్టాల్లోంచి విముక్తి కోసం, సంసారం లోంచి మోక్షం కోసం దుఃఖపడిపోతాడు. బ్రహ్మజ్ఞానం కోసం అర్రులు చాస్తాడు. అర్హుడైన అటువంటి జిజ్ఞాసువుకి - జీవబ్రహ్మైక్య జ్ఞాన సాధనగాను పంచకోశ విచారం ప్రధానం గాబట్టి, అది చెబుతా విను.

అన్నమయం, ప్రాణమయం, మనోమయం, విజ్ఞానమయం, ఆనందమయం - అని అయిదు కోశాలున్నాయి.

## 1. అన్నమయ కోశం

ధరాజాతాలైన ఆహారాలు స్వీకరించడంవల్ల-స్త్రీలలో శోణితం, పురుషుల్లో శుక్లం పరిణమిస్తాయి. వాటివల్ల ఆడా మగా కామమోహితులౌతారు. యోనీమేఢ్రాలతో పీడించుకుంటారు. మేఢ్రం నుంచి శుక్లం యోనిలో పడుతుంది. అది శోణితంలో లీనమవుతుంది. మూడు రాత్రులకా మిశ్రమం చిన్న 'బుగ్గ'లా అవుతుంది. వారాలూ – నెలలూ గడుస్తున్న కొద్దీ క్రమంగా కాళ్ళూ చేతులూ వగయిరా అవయవాలు కలిగి మానవ శరీరంగా మారి ఆధానాత్ పదో నెల్లో శిశు జననం జరుగుతుంది. ఆ బిడ్డ పాలూ అన్నాలతో ఎదుగుతాడు. జబ్బులు, ముసల్తనం, మరణం వంటి దోషాల్తో కూడుకున్న ఈ స్థూల శరీరమే అన్నమయ కోశమని

చెప్పుకోవచ్చును ఈ కాయం శుక్ల శోణిత సమ్మేళనా పరిణామం. గనక మల మూత్ర గర్తాలతో పొర్లి అపవిత్రం, అమంగళం. అనిత్యం. అయి వుంటుంది అలాంటి ఈ దేహాన్నే "నే" ననుకుని, దేహాత్మ బుద్ధితో పామరులు-తీర్థయాత్రలూ, క్షేత్రదర్శనాలూ, పూజలూ పునస్కారాలుతో పునీతం చేసుకో ప్రయత్నిస్తుంటారు. పాల్పెరుగులు, భోజనౌషధాలు స్వీకరిస్తారు. తలంట్లు మొదలైన శుద్ధులు చేస్తారు. బట్టలు, నగలూ లాటి లౌకిక డంబాలు చేస్తారు ఆయురారోగ్య లావణ్యాధికారాలు సాధిస్తూ-శరీర సుఖమే పురుషార్థ మనుకుంటారు.

ఏ సందర్భంలోనో ఏ గురువు చేసే ఉపదేశంలోనో-శరీరాన్ని అన్నమయకోశంగా తెల్సుకుని అవివేకులు డీలా పడిపోతారు. తెలివైనవాళ్ళు తమని తెలుసుకునేందుకు ఆలోచిస్తారు. "ఈ చెంబు నాది - ఈ చాప నాది అనుకుంటే-ఆ చెంబూ చాపా నావే కాని నేను కానట్టే, ఈ కన్ను నాది-ఈ కాలు నాది అన్నప్పుడు కూడా - ఈ కన్నూ కాలూ నావేగాని నేనుగాను. అలాగే ఈ శరీరం కూడా నాదేగాని-నేనుగాను. అమ్మయ్య. నేనీ నశించిపోయే శరీరాన్నిగాను. నేను నిత్యుణ్ని. నేను చైతన్యాన్ని. నేను సర్వసాక్షిని. నేనీ తోలు శరీరంకన్నా అతీతుణ్ని" అనుకుంటారు. ఇంకా—

—ఈ శరీరాలు కలల్లోని కోరికల్లాటివి నిరంతరం తండోపతండాలుగా ఏర్పడుతూ-బెంగ పెట్టేస్తాయి. ఈ అవయవాలు కర్మవల్ల సంప్రాప్తించాయేగాని, నిజానికి నాకు వీటితో పొత్తేమీ లేదు. నేను విమలుణ్ని. నిరామయుణ్ని!

అని భావిస్తూ, దుర్వాసనల్ని దూరం చేసుకుని-సంతతాత్మానుసంధానశీలుడై భ్రమలు తొలగి, దుఃఖాలొదిలి-సుఖపడతాడు.

## 2. ప్రాణమయ కోశం

నోరు, చెయ్యి, కాలు, మర్మాంగం, గుదం అనే కర్మేంద్రియాలయిదూ కూడా ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమాన-అనే అయిదు వాయువుల్తో కూడి ప్రవర్తిస్తాయి.

ప్రాణమనేది అణుమయమే అయినా, శరీరమంతా నిండి వుంటుంది. "ఈ శరీరం కాకపోతే- నే-నా ప్రాణాన్నే" ననే భ్రమలోపడి మనిషి ఆ ప్రాణ రక్షణార్థం నిత్య కృత్యాలూ, అన్నపానాలూ మొదలైనవి చేస్తుంటాడు. ఆకలిదప్పులు తీర్చుకోడం పురుషార్థమనుకుంటాడు. ప్రాణ రక్షణమే ఆత్మ రక్షణమనే అభిప్రాయంతో తెలివితక్కువాళ్ళంతా - ప్రాణం నెపంతో శరీరాన్ని పెంచి పోషించుకుంటూనే వుంటారు.

తెలివైన వాళ్ళు మాత్రం- "ఈ తనువో తోలుతిత్తి. ప్రాణం ఈ తిత్తిలో తిరిగే గాలే తప్ప అనంతుడనయిన - నేను - కాదు. ఈ ప్రాణం నాదేగాని, నేనుకాను. అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మృత్యువు, ప్రజాపతి అనే పంచ దైవతాల చేత ప్రేరేపించబడి ప్రవర్తించేస్తూ - మాట్లాడే నోరూ, ఇచ్చి పుచ్చుకునే చేతులు, నడిచే కాళ్ళూ, సంభోగ సుఖాన్నిచ్చే ఉపస్థు, విసర్జనలుచేసే గుదం - అనే వాటిల్లో

మసుల్తూ ఆకలిదప్పులూ సగయిదాలు కల్పించే ఈ గాలులు నేను కానుగాక కాను నేను ద్రష్టని మాత్రమే-" అని విచారించు మేల్కొన్నది మొదలు నిద్రపోయేదాకా ఆత్మ చింతనతోనే కాలం గడుపుతూ - కష్టాల కంపలాంటి ఈ సంసారంలోంచి తెమిలి పోతాడు.

### 3. మనోమయ కోశం

వాగాది కర్మేంద్రియాలతో కూడి, యిచ్ఛాశక్తితో కలిసి. సందేహ స్వరూపమై-ఆభాసగా సాగే అంతఃకరణ వృత్తి విశేషమే మనోమయ కోశం. ప్రాణం మల్లేనే మనసు కూడా దేహమంతా నిండి వుంటుంది. మూర్ఖులయినవాళ్ళు ఆ మనసే ఆత్మ పదార్థంగా భావించుకుని - "నేను సుఖించాను- నేను దుఃఖించాను" అనుకుంటూ మనోభీష్టాలు తీర్చడమే ఆత్మసేవగా భావిస్తారు. కోరికలో కోరల్లో చిక్కి గోల పడి పోతుంటారు.

బుద్ధిమంతులైన వాళ్ళు మాత్రం "చంద్రుడనే అధి దేవతచేత ప్రేరేపించబడి ఆంతర్యమనే అధిభూతంలో ప్రవర్తిస్తూ - ఈ మనసనేది కర్మాధీనతవల్ల సుఖదుఃఖాల ననుభవిస్తోంది ఆ అధిదైవతంగాని, అధిభూతంకాని, ఆ మనసనే దినుసుగాని-ఈ మూడూగాని నేను కాను. ఈ మనసు నాదే కాని, నేను మాత్రం కాదు. నేనీ మనోమయ కోశానికి సాక్షిని మాత్రమే. శుద్ధ బుద్ధ సత్య ప్రకాశుడినే తప్ప

ఇతరం కా''నని చింతించి - జననాది మరణ పర్యంతం ఆత్మ ధ్యాసలో పడి అవతలిగట్టు చేరుకుంటాడు.

## 4. విజ్ఞానమయ కోశం

చెవి, చర్మం, కన్ను, నాలిక, ముక్కు అనే అయిదు జ్ఞానేంద్రియాల్తో కలిసి కర్తృత్వ భోక్తృత్వాది ధేయమై తోస్తూ-పరలోక గమనాగమనాలకు సమర్థనాత్మమై, నిశ్చయ స్వరూపమై, ఆభాసగా వుండే అంతఃకరణ ప్రవృత్తియొక్క మరో విశేషమే ఈ విజ్ఞానమయ కోశం. ఇది కూడా మానవ శరీరంలో నిలువెల్లా నిండి వుంటుంది.

బుద్ధి జాడ్యం వున్నవాళ్ళు కొందరు ఈ విజ్ఞానమయ కోశమే ఆత్మపదార్థంగా అనుకుంటారు. తన్నిమిత్తంగా యోగాలు, ఉపాసనలు, పూజలు - ఒకటేమిటి రకరకాల తంతుల్లో లీనమైపోతారు. వీళ్ళుచేసే క్రియల కనుగుణంగా స్వర్గాది భోగాలు పొందుతారేగాని - మోక్షాన్ని మాత్రం పొందలేరు. అబ్బాయ్! అయినా వాళ్ళకవే పరమ పురుషార్థాలుగా తోస్తాయ్ మరి...మనమేం చేస్తాం!

కాని వివేకవంతులు మాత్రం ఈ విజ్ఞానమయ కోశాన్ని కూడా నిరసిస్తారు. "నా బుద్ధ్యనుసారంగా ప్రవర్తించే ఈ విజ్ఞానమయ కోశం నాదే. కాని, నేను మాత్రం కాదు. దిక్కులు, గాలి, అర్యముడు, ప్రచేతసుడు, స్వరూపుడూ అనే అధిదేవతా ప్రేరితాలై-చర్మం, కళ్ళు, ముక్కు, చెవులు అనేవి పనిచేస్తాయి. వాచస్పతి అనే అధిదైవతంవల్ల

ప్రేరేపించబడ్డ 'బుద్ధి' అనేది - పై వాటిని కదుపుతోంది. అంతేతప్ప - అది నేను కాదు" అని నిశ్చయించుకుంటారు. వీళ్ళు దేహపోషణార్థం వ్యవసాయం, వాణిజ్యం వంటివి చేస్తు న్నప్పటికీ కూడా - తాము నిష్క్రియులమనీ, అకర్తలూ అభోక్తలూ అని భావించుకుంటూ ఆత్మ చింతనా పరులవు తారు. సాక్షిమాత్రులుగానే మిగుల్తారు.

## 5. ఆనందమయ కోశం

మెలకువ, కల వంటి ప్రధాన ఘట్టాలను కూడగట్టు కుని, జీవోపాధియైన అంతఃకరణం, వాటిని తనలో లీనం చేసుకుని, అవిద్య, అవ్యక్తత, యమతమంబై - నిద్ర మొద లైన శబ్దాలద్వారా పలకబడిన ఆభాసమే వ్యష్టి జ్ఞానకోశం. అదే కారణ దేహం అంటారు. అన్ని కోశాలా వుండేది అజ్ఞానమేననుకో. అయితే ఆ పూర్వ కోశాలన్నింటా పరుచుకునుంటుంది ఆనందమయ కోశం. కడుపునిండితే ఆనందం. లేకపోతే దుఃఖం. ప్రాణం సుఖంగా వుండాలి. మనో వాంఛలన్నీ తీరాలి. ఉద్యమగతుల కోసం యజ్ఞ హోమం చెయ్యాలి. ఏం జరక్కపోయినా దుఃఖమే. అన్నీ కరుపుకుని పొందే ఆనందమే — 'ఆత్మ' అనుకుంటారు కొంతమంది.

విజ్ఞానవంతులా అనుకోరు. వాళ్ళు - ఆనందమయ కోశానికి ఆశ్రయమైన సాక్షి స్వరూపులే తాముగా భావించి

ఆత్మానుసంధానంలోకి దిగుతారు. "ఈ కోశం నాదేగాని-నేనుగాను" అనుకుంటారు.

చీకటి రూపంగల రాహువు - సూర్యుణ్ని ఆచ్ఛాదించినట్లే - నిద్రాదులతో అజ్ఞానమనే చీకటి చెడబలుస్తుంది. జ్ఞాన స్వరూపమై మానితాధిష్ఠానము మనోహరమూ అయిన స్వప్రకాశంలో కల్పనా సంబంధంగా విలసిల్లి, నిద్రాగతమైన జడం మేల్కొంటుంది. అలా లేచి - ఏమీ అర్థంగాక - ఇంత సేపు సుఖంగా నిద్రోయి లేచాననుకుంటుంది. కాస్త తెలివిని పడుతుంది. అందుకు నేను సాక్షినే కాని - ఆ కోశాన్ని గాను.

ఉపరివిధంగా - పంచకోశాల్ని గమనించి, నిరసించి, యదార్థమైన ఆత్మానుసంధానానికి పూనుకున్ననాడే సద్గతులు కలుగుతాయి-అని చెప్పి-క్షణం మౌనం వహించాడా గురువు.

—పదకొండో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## పన్నెండో పాఠం

### శ్రీ గురోవాచ – గురువు చెబుతూన్నాడు

పూర్వం ఓ విష్ణు భక్తుడుండేవాడు. చాలా ఉత్తముడు. నిత్య నైమిత్రికాలనీ, సత్కర్మల్ని తప్పకుండా చేసి-ఆ సమస్తం నారాయణార్పణం చేస్తూవుండేవాడు. కొన్నాళ్ళకతని శుద్ధాంతఃకరణం ప్రాప్తించడంతో బ్రహ్మ విద్యాభ్యాసానికి అర్హుడూ-అధికారయ్యాడు. ఆలోచించసాగాడు. "ఈ ప్రపంచమంతా కర్మ నిర్మితం - అనిత్యమూ దుఃఖ కారకమూ మాత్రమే"నని గ్రహించాడు. అంతలో సంసారం పట్ల భయం పట్టుకుంది. ఇహంపట్ల విరక్తిపడ్డాడు. శమాది షట్క- ప్రవృద్ధివల్ల - ముముక్షువయ్యాడు. ఆ బుద్ధి పుట్టగానే తక్షణమే-గురువుదగ్గరికి వెళ్ళి తగుసాటి కానుకల సమర్పించి-నమస్కరించి-మోక్ష మార్గాన్ని తెలియ జేయమని ప్రార్థించాడు. అతని విన్నపాలకు సంతుష్టుడైనగురువు, అతణ్ణి అర్హుడిగా భావించి చెప్పసాగాడు——

——మహా వాక్యార్థాలని బోధించడంద్వారా జ్ఞానాన్ని పొందడమే ముక్తికి సాధనమని పెద్దలమాట! నాలుగువేదాల సారమూ ఉపనిషత్తులుగా తీర్చబడ్డాయి. ఆ ఉపనిషత్తుల్లో

నాలుగు మహా వాక్యాలున్నాయి. వాటిలో మొదటిది—ఋగ్వేదాంతర్గతమైనది.

"ప్రజ్ఞానం బ్రహ్మ"

రెండోది యజుర్వేదగతమైంది - అది

"అహం బ్రహ్మాస్మి"

మూడోది - సామవేదాంతర్గతమైనదీ - ఆర్య మతానికి చేరువైనదీయైన

"తత్ త్వమసి"

ఇక నాలుగోది - అధర్వణాంతర్గతమైనది- అది -

"అయ మాత్మా బ్రహ్మ"

వీటిలో ముందుగా "తత్త్వమసి" చూద్దాం. ఇందులో మూడు పదాలున్నాయి. 1. తత్. 2. త్వం. 3. అసి.

ఇక పదార్థాలను చూద్దాం. తత్ పదానికర్థం ఈశ్వరుడు. త్వం పదార్థం జీవుడు. 'అసి'అంటే ఇద్దరూ ఒక్కటే నన, ఐక్యతని చెప్పడం. ఇక విను.

ముందు అంతఃకరణం, అధిష్ఠానమైనది చైతన్య తేజం. ఆ చైతన్యంలో కల్పించబడిందే లింగ శరీరం. ఈ లింగ శరీరంలో ప్రతిఫలించేవాడే చిదాభాసుడు. కించిజ్ఞత, కర్తృత్వం, భోక్తృత్వం - ఇవన్నీ ఆ పురుషుడి తత్వాలు. అవే జీవ తత్వాలు.

అని చెప్పి - అనంతర ఈశ్వర తత్వాన్ని చెప్పి -సర్వజ్ఞుడైన ఆ 'తత్' నువ్వేనన్నాడు గురువు. భక్తుడి కర్థం కాక మళ్ళీ వివరించమన్నాడు. గురువిలా అంటున్నాడు.

—అబ్బాయ్! నీకు నితా నిత్య వస్తు వివేకం లేదురా నాయనా! అందుకే ప్రతిదానికి సందేహపడి పోతున్నావు. కొంచెం శ్రద్ధగా విను వాఖ్యార్థం-లక్ష్యార్థం అని రెండుంటాయి. వాఖ్యార్థం తీసుకుంటే లక్ష్యార్థం వుండదు. ఇది తీసుకుంటే అదుండదు. వాఖ్యార్థం అనాత్మ. అందువల్ల లక్ష్యార్థమే గ్రహించాలి. ఒకవేళ వాఖ్యార్థాన్నంగీకరించినా - ఎక్కడ - వికటత్వం వస్తే అక్కడ లక్ష్యార్థాన్నే తీసోకవాలి.

ఇక, లక్షణాలు మూడు. 1. జహల్లక్షణం 2. అజహల్లక్షణం 3. జహద జహల్లక్షణం. అంటే 1. వదిలేసిన లక్షణం 2. వదలని లక్షణం 3. వదిలీ వదలని లక్షణం.

ఒకడు గంగా తీరంనించి కావేరీ తీరానికొచ్చాడు. అక్కడి వాళ్ళతన్ని ఎక్కణ్నుంచి వచ్చావని అడిగారు. గంగ దగ్గర్నుంచీ అన్నాడతను. విశేషాలేమిటీ అన్నారు వినేవాళ్ళు - అతనేవేవో చెబుతూ చెబుతూ "గంగాయాం ఘోష" అన్నాడు. విన్నవాళ్ళకు అర్థం తియ్యగా 'గొల్లపల్లె ప్రవాహంలో వుంది' అని అర్థం వచ్చింది. అది ప్రవాహంలో వుండడమేమిటి? అంచేత ఆ వాఖ్యార్థం తప్పు - ఇక్కడా "గంగా తీరాన" అనే అర్థాన్నే చెప్పుకోవాలి. ఇది మొదటిది. రెండో అజహల్లురించి చూద్దాం.

దీనికి నేను చెప్పిన మహావాక్యం ఉదహరించకూడదు. ఎందుకంటే - త్వం పదార్థభూతమైన జీవరూపం. ఆది జీవ కూటస్థ పదం. పనిగట్టుకుని వదిలివేస్తే ముముక్షులను స్వస్వరూపం సడలిపోతుంది. అది చెప్పడం ప్రత్యక్ష విరుద్ధమే

అవుతుంది. అయితే జహదజహ ల్లక్షణంతో చెప్పొచ్చు.
చెబుతా విను.

పంచకోశాల్ని పరమాత్మగా చెబుతారు పామరులు. కాని కోశాలు, జడాలు, ఆత్మచైతన్యం. కనక కోశా లాత్మ కావని తెలుసుకో. అయితే వాటి అధిష్టానమైన చైతన్యం స్థిరమే.

ఇక - 'మంచాపి క్రోశంతి' అనే మాటని తీసుకో- మంచలు కూతలు పెడుతున్నాయని అర్థం. మంచలు జడాలు కదా! అవి కూతపెట్టడం విరుద్ధం. అంచేత - మంచలు కాకండా - మంచలపైనున్న జనం అని అర్థం చెప్పుకోవాలి.

ఈ ప్రకారం వేదంలో 'సత్యజ్ఞాన మనంతం బ్రహ్మ' అనే వాక్యం - ఆనందమయ కోశంలో కూడి వున్న బ్రహ్మను చెబుతోంది. కాని మహావాక్యార్థంలా దీనిని చెప్ప కోరాదు. సదానందాదుల్ని వదలకండానే ఆనందమయ కోశాన్ని చెప్పాలీ అంటే - తెలివి తక్కువ వంటి వాదాల్తో కూడిన జీవుడికీ, గుణంలేని వాడికీ అయిక్యం చెప్పకూడదూ కాబట్టి ఆనంద కోశాన్నొదిలి సచ్చిదానందాలు మాత్రమే చెప్పుకోవాలి.

మరోటి చూద్దాం "సోయం దేవదత్త" మని ఓ వాక్యం.

ఓసారితన్ని గంగాతీరంలో చూశాను ఇప్పుడు కావేరీ తీరంలో చూస్తున్నాను. ఇతడు దేవదత్తుడు. అంటే

ఎక్కడ చూసినా అతను దేవదత్తుడే - దేశ కాలాల్నీ, వయస్సునీ విచారిస్తే—ఇది విరోధాభాసం. ఎలాగంటే-

గంగా తీరం - కావేరి గట్టుకాదు. ఇది అదికాదు. ఆ కాలం వేరు ఈ కాల వేరు. అప్పటి వయసు వేరు— ఇప్పుడు వయసు వేరు. కాబట్టి - ఈ దేశ కాలమానాదులనే వాక్యార్థాల్ని ప్రక్కకి నెట్టేసి, లక్ష్యార్థాన్ని గ్రహిస్తే దేవదత్తుడనే వాచ్యార్థం ఎలా వీలవుతుంది? అదే విధంగా మహా వాక్యానుసారం-

తత్ పదానికి మాయ అర్థమవుతోంది. మాయలో ఈశ్వరుడు ప్రతిబింబిస్తుంటాడు. అతని సర్వజ్ఞత్వాదాత్మలు 'త్వం' పదానికందుతాయి-

త్వం పరమైన జీవుడు అవిద్యలో వుంటాడు - విరా బాహుడు అతి తక్కువ జ్ఞానం మాత్రమే వుంటుంది. ఇవి ప్రత్యక్ష విరుద్ధాలు గనక ఆ అర్థాలు తీసుకోకూడదు. అవి ప్రక్కన పెట్టి లక్ష్యార్థమైన శుద్ధచైతన్యాన్ని మాత్రమే తీసుకోవాలి సచ్చిదానంద ధర్మమైన బ్రహ్మమే నువ్వు ... అని చెప్పాలి. ఇదే జహద జహల్లక్షణం. మహా వాక్యాలు నాలుగు కూడా- ఈ లక్షణానుసారమే. ఇక వాక్యార్థాలు విను

1) ప్రజ్ఞానం బ్రహ్మ :- సకలేంద్రియాల ద్వారా దృశ్యమానాలయ్యే కారణాలూ - వాటిని చేయించే జ్ఞానం, అంతఃకరణా - దాని వృత్తులై కలిగే సంకల్ప వికల్పాదిక జ్ఞానం, ప్రాణ-ప్రాణధర్మం, క్షుత్పిపాసికం ఇత్యాదులకి సాక్షి

రూపమై వుంటూ - ఈ ప్రపంచంలో ఏ జ్ఞానమైతే తానుగా ప్రకాశిస్తోందో అదే ప్రజ్ఞానం.

చతుర్ముఖ బ్రహ్మాది ఈలుపుదాకా సర్వే సర్వత్రా రవ్వంత ఎడం కూడా లేకుండా వ్యాపించిన మహాచైతన్యమే బ్రహ్మన్...

ప్రజ్ఞానం అంటే "నువ్వు"-"బ్రహ్మ" అంటే-బ్రహ్మ.

2) అహం బ్రహ్మాస్మి :- నేనే బ్రహ్మనైయున్నాను.

3) అయమాత్మ బ్రహ్మ :- ఆత్మే - పరమాత్మ.

వెళ్ళి సాధన చెయ్యి - అని చెప్పి - గురువు హస్తామస్తక సంయోగంగా శిష్యుణ్ణి దీవించి శాంభవీముద్ర నను గ్రహించాడు. కృతార్థుడై, కృతాభ్రితా పూర్వకంగా - గురువుకు మొక్కి శిష్యుడు తన ఆశ్రమాన్ని చేరాడు.

ఎవరైతే ఈ గాథను వ్రాస్తారో, చదువుతారో - ఇతరులకు వివరించి చెబుతారో వారి మహిమలు పెరుగుతాయి. వారి గొప్పదనం పొగడటం భూమిమీద యెవరికీ సాధ్యంకాదు.

—పన్నెండో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## పదమూడో పాఠం

గురోవాచ :-

"దృగ్దృశ్య వివేకోద్య" గ్రంథంలో విద్యారణ్యుల వారు ప్రతిపాదించిన తాదాత్మ్యత్రయ వృత్తుల్ని చెబుతాను విను.

తాదాత్మ్యం అనేది - 1. సహజం, 2. కర్మజం, 3. జన్యం - అని మూడు రకాలు.

దైహిక బంధనాతీతమైన చిత్తం, అహంకారంలో ప్రతిబింబించి, అహం - ఆయాసం అనే భేదరహితంగా ఏకీకృతమై-చక్కగా వండబడిన ఆహారంలాగా చిద్రూపంలో వుంటుంది. ఆ 'చిత్' యొక్క ప్రతిబింబాన్ని ఆవహించి వున్న గొప్పదయిన అహంకారం తాలూకు ప్రతిబింబంతోడి మమైక్యతే సహజ తాదాత్మ్యంగా చెప్పబడుతోంది. ఈ రెండూ ఏకకాల సంజాతాలు కావడంవలన దీనికా పేరొచ్చింది.

పై విధంగానే చిత్ప్రతిబింబంతో కూడి, చిద్రూపంతోటి "అహం" స్థూల దేహాన్ని సోకిన సందర్భంలో — అహంకార, స్థూలదేహ సంయోగం కర్మజ తాదాత్మ్యం

అనబడుతోంది. ఇది కర్మాచరణలోనే యేర్పడుతుంది. కర్మ ముగియగానే సమసిపోతుంది. కాబట్టే దీనికి కర్మజ తాదాత్మ్యం అని పేరు.

మూడోది జన్యం. దీనినే భ్రాంతి జన్యం అంటారు. నేను బ్రాహ్మణుడిని, నేను రాజుని, అనే వర్ణ విషయకంగా గాని - లేదా - నేను బ్రహ్మచారిని, నేను గృహస్థుణ్ని అనే ఆశ్రమ ధర్మ విషయకంగాగాని - లేదా - చిత్త వృత్తుల రీత్యాగాని, సాకారమైన అహంకారానికి - అహం - సాక్షీ భూతమై తాదాత్మ్యం చెందినప్పుడే జన్య తాదాత్మ్యం కలుగుతుంది. సర్వాధికారియైన ఆత్మను గుర్తించలేక - దైహిక భ్రమాయత్తమై యేర్పడే కారణంగా దీనికి భ్రాంతి జన్య తాదాత్మ్యం అని పేరొచ్చింది.

చిత్ శక్తి, అహంకారం అనేవి ఎన్నాళ్ళయితే సమ బుద్ధితో కలిసి వుంటాయో-అన్నాళ్ళు సహజ తాదాత్మ్యం వదలదు.

స్థూల శరీరంయొక్క భోగనీయ కర్మ సంగతం గనక- ఆ కర్మ నిద్దట్లో అణగారిపోతుంది గనక, ప్రతిరోజూ నిద్రలో కర్మజ తాదాత్మ్యం అనేది తొలగి పోతూంటుంది.

ప్రాపంచిక భ్రాంతుల్నించి బైటపడి, ఏనాడయి

బ్రహ్మజ్ఞానాన్ని పొందగలుగుతారో ఆనాడే భ్రాంతి జన్య తాదాత్మ్యం నశిస్తుంది.

మొత్తం మీద పై మూడూ కూడా అహంకార జన్యాలే. అధిగమించినవాడే తాను సర్వోపాధి నిర్ముక్తుణ్ణనీ, ఆదిమూర్తిననీ గ్రహించుకోగలుగుతాడు. సాధ్యమా!

శివుడు లేనిదే శక్తి లేదు. శక్తి లేనిదే శివుడు లేడు.

వాళ్ళిద్దరూ — కట్టెలోని అగ్నివలె - నిత్యం తాదాత్మ్యులయ్యే వుంటారు.

వాళ్ళు మనల్ని రక్షించెదరుగాక.

—పదమూడో పాఠం సమాప్తం—

# వివేకసింధువు

## పద్యాలుగో పాఠం

## (అజిహ్వత్వాది నిరూపణలు)

గురువు చెబుతూన్నాడు—

ఇంకిప్పుడు - అజిహ్వాదిగా గల ఆరుగురి గురించి చెబుతాను. విను.

శ్లో॥ అజిహ్వో షండకః పంగు రంధో బధిర ఏవచ,
ముగ్ధస్యముచ్చ్యతే భిక్షుః షడ్భిరేవ నసంశయః॥

వీళ్ళలో మొదటివాడు అజిహ్వుడు. అంటే, "నోట్లో నాలుక లేనివాడు" అనుకుంటావేమో! అది తప్పు. చాలా తక్కువగా మాట్లాడేవాడూ, అందులో కూడా నిజమే తప్ప విడిచి - యేనాడూ అబద్ధం చెప్పనివాడూ - భోజన సమయంలో, రుచుల్ని పట్టించుకోకండా, షడ్రుచుల్నీ (ఉప్పు, పులుపు, కారం, తీపి, చేదు, వగరు) సమ దృష్టితో సేవించేవాడూ, యోగసాధనాధికారీ అయినవాణ్ని "అజిహ్వుడు" అంటారు.

వీడి తర్వాతవాడు "షండుడు"- అంటే నపుంస

కుడు. లైంగిక పరమైన కామాచరణ రహితుడు అనేది యాథార్థం. కాని, ఇక్కడ ఆ అర్థం చెప్పుకోకూడదు. ఎవడయితే కామ కళా శాస్త్రంలో నిష్ణాతుడై వుండీకూడా, నిశ్చలంగానూ - నిర్మలంగానూ వుంటాడో వాణ్ణే "షండుడు" అంటారు. అప్పుడే పుట్టిన ఆడపిల్లనీ, ముప్పాట బడుతూన్న ముసలిదాన్నీ పదహారు - పద్దెనిమిదేళ్ళ ప్రాయంలో పిట పిటలాడిపోయే పడుచుదాన్నీ- ఈ ముగ్గురియందూకూడాఏవిధమైన వికారమూ లేని సమదృష్టితో వుండేవాడే షండుడు.

అనంతరం వాడు పంగువు-అంటే- సామాన్యార్థంలో "కుంటివాడు"- లేదా "కాళ్ళవిషయంలో లోపంవున్న వాడు" -అని అర్థం. అది లౌకికం. మన వేదాంతంలో అర్థంవేరు. వెళ్ళకూడని చోట్లకి వెళ్ళనివాడూ - పనిపాటులు జరిగే చోట్లల్లో మలమూత్ర విసర్జనాదులు చేయకండా- ఆ స్థలానికి యోజనం దూరంగా వెళ్ళే వాడే పంగువు.

తదుపరివాడుఅంధుడు.అంటే కళ్ళు కనబడకనికాదు. బయటి ప్రపంచంపట్ల విరక్తిభావంలో వుంటూ-నిత్యం అంతర్ముఖుడై ఆత్మ సాక్షాత్కారాన్ని కోరుకునేవాడు అని అర్థం. ఒకవేళ- దేనినయినా చూడాల్సివచ్చినా, ఆ చూసినదాని వికారప్రభావాన్ని పొందడు.

ఈ తర్వాత బధిరుడు. అంటే చెవిటివాడు. వినబడదని కాదు అర్థం- దూషణ భూషణ తిరస్కారాలు మూడింటినీ ఒకలాగే భావిస్తాడని అర్థం. తెగిడినా, పొగిడినా కూడా ఏ విధమైన వికారాన్నీ పొందడు. అన్నింటికీ చిరునవ్వే సమాధానంగా వుంటూ తన ధోరణిలో తను ఆత్మానుసంధానంలో వుండిపోతాడు.

కట్ట కడపటి, చిట్టచివరి వ్యక్తి "ముగ్ధుడు" అలాగని మూర్ఖుడు కాదు సుమా! తాను సర్వశక్తి సంపన్నుడయి వుండీ కూడా, తన చుట్టూ వున్న - ప్రాపంచిక విషయాలన్నింటినీ తృణీకరభావంతో చూసి, ఆత్మీయుడు పరమాత్మ డొక్కడేనని నమ్మి - ఆత్మానుసంధాన పరుడయ్యేవాడే ముగ్ధుడు.

ఒరే అబ్బాయీ! ఇంతవరకూ నీకు చెప్పిన ఆరు రకాల యోగులయొక్క లక్షణాలూ కూడా -ఏ ఒక్కడిలో వుంటాయో -వాడే జ్ఞానార్హుడు-వాడే ఆత్మ సాక్షాత్కారం పొందేందుకు అర్హుడు.

అంటే - 1. రుచులపట్ల వికారం లేకుండా, వాగుడు కాయ ధోరణి నరికట్టుకోగలగడం, అసత్యం పలక్కపోవడం, 2, కామవాంఛల నధిగమించడం, 3. దూరా దూర వికార రహితమైన నడక, 4. తెగడినా, పొగడినా తేడా పడక

పోవడం, 5. కనబడుతూన్న ప్రపంచంపట్ల భ్రమ పడకండా వుండడం, 6. ఇహాన్ని తృణీకరించి, ఆత్మస్థాయినే అధిరోహించడం - అనబడే యీ ఆఱు గుణాలూ కలగలిసి వున్నవాడు మాత్రమే - ఆత్మ సాక్షాత్కారానికి యోగ్యుడు.

— పద్నాలుగో పాఠం సమాప్తం —

# వివేకసింధువు

## పదిహేనో పాఠం

## (ప్రతిబంధ త్రయ నిరూపణం)

గురోవాచ :-

గురువు చెబుతూన్నాడు -

జ్ఞానమార్గంలో పయనించే వాళ్ళకి కలిగే-అనేకానేక అనుమానాల్ని అంతరింప చేసేదీ, చక్కటి తెలివిని కలిగించేదీ అయిన ప్రతిబంధ త్రయం గురించి చెబుతాను విను. ప్రతిబంధాలంటే అడ్డంకులు. ఇవి మూడు విధాలు. 1. భూత ప్రతిబంధం 2. వర్తమాన ప్రతిబంధం 3. భావి (వి) ప్రతిబంధం.

### 1. భూత ప్రతిబంధం

వెనకటికో బ్రాహ్మణుడు సంసార పోషణార్థం ఒక గేదెను సంపాదించాడు. ప్రతిరోజు ప్రత్తి గింజలు, మంచి గడ్డి, కుడితీ పెడుతూ ఏపుగా మేపేవాడు. నిత్యం దాని పాలు పిండుకుని - పాలు, పెరుగు, వెన్న, నెయ్యీ

వ్యాపారంచేస్తూ కుటుంబాన్ని పోషించుకునేవాడు. అన్న వస్త్రాలకే లోటూ లేకండా భార్యాబిడ్డల్తో కులాసాగా గడిపేస్తున్నాడా విప్రుడు. ఊరి వాళ్ళలో ఆదర్శ కుటుంబంగా వుండేదా సంసారం. అలాటి సమయంలో అనుకోకండా కరువొచ్చి పడింది. కర్మవశాన ఆ కరువుకాటకాలకి ఈ బ్రాహ్మణుడి ఆలుబిడ్డలూ,బంధుమిత్రులూ అందరూ బలై పోయారు. గేదె కూడా చనిపోయింది. బ్రాహ్మణుడు ఏకాకిగా బ్రతికి మిగిలాడు.

దాంతో - ఎంతో శాశ్వతమైందనుకున్నానీ సంసారాన్ని, క్షణంలో లేకండా పోయింది గదా! నా బ్రతుకూ ఇలాంటిదే గదా - అని ఆలోచించి, విరక్తుడై, ఒక సద్గురువు నాశ్రయించి ఆ ముష్మిక సాధనలో మునిగిపోయాడు. కొన్నాళ్ళకా గురువు - ఈ బ్రాహ్మణ్ణి చేరబిలిచి — "ఏమయ్యా! నా బోధలు విన్నావ్. ఉపదేశం పొందావ్ సాధన చేస్తున్నావు. ఎంతవరకూ వచ్చింది నీ సాధన! ఏమైనా ఇబ్బందులుంటే చెప్పు. తప్పించుకునే దారి చెబుతాను" అన్నాడు.

తక్షణమే విప్రుడు చేతులు కట్టుకుని "గురువుగారూ! సాధన అంతా సజావుగానే సాగుతోంది. ఎటొచ్చీ, నా పూర్వాశ్రమంలో - సంసార పోషణార్థంగా ఒక గేదెని

ఎంతో మమకారంతో పెంచుకున్నాను. అయిన వాళ్ళతో బాటే అది కూడా చచ్చిపోయిందనుకోండి. కాని, అదిప్పుడు నా జప తపాల్లోనూ, ధ్యానాభ్యాసాల్లోనూ అస్తమానూ కనుపించి కుదుర్లేకండా చేస్తోంది" అని విన్నవించుకున్నాడు.

వెంటనే గురువది "భూతప్రతిబంధం"గా గుర్తించాడు. ఆ ప్రతిబంధం నుంచి శిష్యుణ్ణి తప్పించేందుగ్గాను - ఈ విధంగా తత్త్వోపదేశం చెయ్యసాగాడు:-

"శిష్యా! అస్తమానూ నీకా గేదే కనిపిస్తోంది కదూ! అంటే ఆ గేదెనెప్పుడు తలుచుకున్నా, అవయవ సహితమైనదిగానే భావిస్తున్నావు. దాని పేరు "గేదె" కదా అని చింతిస్తూన్నావు. ఇప్పుడు నువ్వు ముందుగా - దాని పేరునీ, అవయవాలనీ స్మరించకు. దానిలో వుండే ఆత్మని మాత్రమే తలుచుకుంటూండు" అని సలహా ఇచ్చాడు.

గురు సలహా ననుసరించి, ఆ బ్రాహ్మణుడలాగే సాధన చేయగా, చేయగా, అతి స్వల్పకాలంలోనే - గేదె అవయవ సహితం తోచడం మానేసింది. నామ రూప రహిత చిదాత్మగా తోచనారంభించింది. తదాది మరింత సాధనతో ఆ బ్రాహ్మణుడు ఆత్మ విద్యను పొందగలిగాడు. ఇది భూత ప్రతిబంధ విషయం!

తరువాద్ది వర్తమాన ప్రతిబంధం. ఇది విషయాసక్తి లక్షణమనీ, ప్రజ్ఞాన మాంద్యం అనీ, కుతర్కమనీ, విపర్యాస దురాగ్రహమనీ - 4 రకాలు.

ఏ విషయంమీద నయినా విపరీతమైన ప్రేమాభిమానాలు కలిగి వుండటం విషయాసక్తి లక్షణం. గురువు ఎంతగా బోధించినా - దాని సారాంశం గుర్తుండకపోవడం ప్రధాన మాంద్యం. గురువు చెప్పిన విషయానికి విపరీతార్థాలు కల్పించడం కుతర్కం. 'దేహమే ఆత్మ' అనే సిద్ధాంతాన్ని త్రవ్వి త్రవ్వి బోధించడం విపర్యాస దురాగ్రహం. ఈ నాలుగూ వర్తమాన ప్రతిబంధ లక్షణాలే !

దమం, ఉపరతి, శమం, తితిక్ష, శ్రద్ధ, సమాధానం అనే ఆరింటివల్ల విషయాసక్తి లక్షణం తొలగుతుంది. తఱచుగా గురుముఖతః సద్బోధల నదేపనిగా వినడం-అదీ పునః పునః వినడం అనే దానివల్ల ప్రజ్ఞానమాంద్యం నశిస్తుంది. గురువు చెప్పినదాన్ని తెఱపి లేకండా మననం చేస్తుండడం వలన కుతర్కం కుదుళ్ళతో సహా పెకలించుకుపోతుంది. నిధిధ్యానాదాలు నియమం తప్పకండా పాటించడంవల్ల విపర్యాస దురాగ్రహం వదిలిపోతుంది. ఇది వర్తమాన ప్రతిబంధాన్ని తొలగించుకునే ఉపాయాలు.

ఇక భావి (తి) ప్రతిబంధం గుఱించి విను. ఇతరులకి కష్టాలు కలిగినప్పుడు యాత్మజ్ఞాతకి దయ కలిగి, అది క్రమంగా ప్రేమగా పరిణమిస్తుంది. అయితే, ఇది ఎప్పుడో, ఎవరికో-కోటికి ఏ ఒక్కరికో మాత్రమే కలుగుతుంది. ముముక్షువైన వాడు - దీనిని భావి ప్రతిబంధంగా గుర్తించి జాగ్రత్త పడతాడు. అలా కాకండా - నేను నిస్సంగుణ్ని కదా-కర్తృత్వం నన్నేం చెయ్యగలదు లెమ్మనుకుని దానిని త్రుంచుకోలేక

పోతే మాత్రం- ఆ దయాశక్తి- మరో కొన్ని జన్మల తర్వాతనే తప్ప మోక్షాన్ని పొందనివ్వదు. విష్ణుమూర్తిఅవతారాలెత్తాడంటే యీ దయాగుణమే కదా! ఆ జన్మలో మోక్షమందుకోవలసిన భరతుడు (జడ భరతుడు లెండి) మరో మూడు జన్మల అనంతరం దాకా ముక్తి పదం చేరుకోలేక పోవడం కూడా యీ భావి ప్రతిబంధ మహిమే !

జీవితంలో ఈ మూడు ప్రతిబంధాలూ పోకనివాడు ఆ జన్మలోనే ముక్తిని పొందుతాడు. చిటమంత పోకినాసరే- ఇకాజన్మకి మాత్రం మోక్షం లేనట్లే-

—ఈ విధంగా వేదాంత సూక్తులను - నిత్యానంద సంధాయకాలను గురువు చెప్పగా వినిన శిష్యుడు- ఆ బోధామృత మహిమవలన జన్మించిన ఆత్మవివేకంతో నిరూఢమైన పరతత్వ లబ్ధిని పొంది సుఖించాడు—

ఈ పుస్తకాన్ని చివరిదాకా క్షుణ్ణంగా పరిశీలించిన వాళ్ళు - లంపటాల కంపయిన ఈ సంసార తాపత్రయాల్నించి తెములుకుని, నిత్యము - సత్యము - నిర్మలమూ అయిన బ్రహ్మవిద్యానుసంధానులై పరమసుఖాన్ని పొందుతారనడంలో సందేహం లేదు. వాళ్ళు దేవతలచేత కూడా స్తుతించబడతారు. ఇందులో విషయాలను తెలుసుకున్న వాళ్ళు జీవన్ముక్తులవుతారు. ముకుంద మునీంద్రుడు వ్రాసిన

ఈ గ్రంథాన్ని కొండనార్యుడు గద్యపద్యయుతంగా లోకోప
కారార్థం వ్రాశాడు. దీనిని చదివినా, విన్నా, వ్రాసినా-
ఆకల్పాంతమూ కూడా ముముక్షువులై, సిరిసంపదలు గల
వారై, అమలిన హృదయులై, సర్వే సర్వత్రా సుఖిస్తారు.

హరిః ఓం తత్సత్

—పదిహేనో పాఠం సమాప్తం—



వివేకసింధువు సమస్తం సమాప్తం

